# ప్రస్తావన

జగత్కళ్యాణము సంపన్న మగుటకును, ప్రపంచ శాంతి ప్రతిష్ఠిత మగుటకును ఉత్తమ సాహిత్య మావశ్యకము. ఉత్తమ సాహిత్యమువల్ల, ఉదాత్త భావము లుద్భవించి ఉన్నతాశయము లుత్ఫుల్లములై ఆత్మోన్నతియు దేశ పురోభివృద్ధియు సమకూరును. అందువల్ల జనులు పరస్పర స్నేహ భావముతోడను అన్యోన్య సాహాయముతోడను చల్లగా సుఖముగా జీవితములు గడపుటకు తగిన అవకాశ మేర్పడును.

జ్ఞానము ప్రతి మానవ హృదయమందును నిగూఢముగా నున్నది. సూర్యరశ్మి సోకినంతనే సూర్యకాంత శిలల నుండి నిగూఢ తేజ ముద్గమించునట్లు ఉత్తమసాహిత్య సన్నికర్షనలన అంతఃకరణమందు గుప్తముగా నున్న విజ్ఞానము బహిర్గత మగును. ముఖ్యముగా బాలుల మనః కేదారము లందు ఉత్తమ సాహిత్య బీజములు నాటుకొనినచో అవి ఉత్తమరీతి నంకురించి ఉత్తమవిధమున నభివృద్ధినొంది ఉత్తమ నీతి విశ్వాసాచరణ రూపమున ఫలించును. నేటి బాలకులే గదా భావికాలమున విజ్ఞానులు, వీరులు, ప్రజాపాలకులు, రాజనీతివిశారదులు, దేశహితైషులు, ధర్మప్రవర్తకులు కావలసినవారు! అట్టి మహాభాగ్యమునే గదా మన మందర ముభిలషించునది ! తద్విషయమై యథాశక్తి ప్రయత్నమే ఈ 'ముక్తావళి.'

ఈ 'ముక్తావళి'యందు నాలుగు కథలు సంఘటితము లైనవి. అందు మొదటిది వీరపత్ని. దీని చారిత్రకవస్తుభాగము రాజస్థాన చరిత్రనుండి గృహీతమైనది. ఇందు ఐహికభోగముల తృణీకరించిన అకలంకానురాగమును శౌర్యౌదార్య త్యాగములును ప్రదర్శితము లైనవి.

రెండవది సోరాబ్ - రుస్తుం. ఇందలి కథాంశము షానామా అను పారసీక గ్రంథమునుండియు, సుప్రసిద్ధాంగ్ల కవి యగు మాథ్యూ ఆర్నాల్డు (Mathew Arnold) రచించిన సోరాబ్-రుస్తుం అను ఖండ కావ్యమునుండియు యథాపేక్షితముగ సంహృతమైనది. జనకునకు కుమారుడనియు, కుమారునకు జనకుడనియు అంతఃకరణము ప్రబోధించుచున్నను, రణధర్మమును వీరధర్మమును పాలించిన వీరపర్యుల గాథ ఇందు సంగ్రథితమైనది.

'పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్' (పుత్రునివల్ల పరాజయము కోరుకొనవలెను - అనగా పుత్రుడు తనకన్న గొప్పవాడు కావలెను.) అనునది మూడవది. ఇందలి విషయాంశము పండిత పరంపరలో చెప్పుకొను కథ ననుసరించినది. గురుశిష్య సంప్రదాయ మనాదిసిద్ధము. గురువునకు పుత్రశిష్యులు సమానులను సంగతి ఉత్తమ గురుశిష్యుల కందరకు ననుభవములో నున్నదే. గురునకు శిష్యవాత్సల్యమును, శిష్యునకు గురుభక్తియు, శిష్యుడుద్దండ పండితుడు కావలెనని గురువును, గురువునకు కీర్తి తేవలెనని శిష్యుడును ప్రయ-

త్నించు చుండుట సార్వకాలికముగను సార్వత్రికముగను జరుగుచున్నదియే. తద్విషయమే ఇందలి వస్తువు.

అనుక్త కథ నాలుగవది. ఇందలి చారిత్రకాంశము 'భారతవర్ష' అను వంగమాస పత్రికనుండి సంకలితమైనది. ఇందు ధీరోదాత్తతయు, ఔదార్యమును, వీరమర్యాదయు, నిష్కళంకానురాగమును, కృతజ్ఞతయు నిబద్ధములైనవి.

ఈ 'ముక్తావళి' యందలి కథ లన్నియు విషయ వైవిధ్యము కలిగి అప్రధానవర్ణనా విరహితములై, ధారాశుద్ధిగను, ఉత్తేజకముగను, హృదయాకర్షకముగను విరచితములైనవి. ఈ 'ముక్తావళి' సర్వధా పాఠకకంఠములకు ముక్తావళి కాగలదని మా యాశయము.

గ్రంథకర్త

# వి ష య సూ చి క

# ము క్తా వ ళి

## వీ ర ప త్ని

౧

వసంతకాలము. ఒకనాటి ప్రభాతము. స్రోతస్వినీ చంచల వక్షమున సూర్యకిరణములు కేళి సలుపుచున్నవి. తీరమున వకుళవృక్షములు శ్రేణీబద్ధమై సాంద్రపర్ణగుచ్ఛముల మరకత మాణిక్యశోభలతో కన్నులపండువు సేయుచున్నవి. వాని నడుమ డాగి ప్రోడకోయిల పంచమ స్వరముతో పాటలు పాడుచున్నది.

వకుళతరుచ్ఛాయలో నలినీ కుమారు లాసీనులై యున్నారు. నలినివదనమున నవ్వులు లేవు. నయనములనుండి అశ్రుధారలు కారుచున్నవి. మేవాడ సేనాపతి అజయసింహుడు యవనసేనాని దాడిని నిరోధించుటకై ఆనాడా యువత్యకా మార్గమున వచ్చెను. అతని వాహినిలో కుమారసింహుడు రెండువేల సైన్యమున కధిపతిగా నియుక్తుడైనాడు. అందు చేత నతడు సేనాని వెంట యుద్ధయాత్రకు బయలుదేరును. ఆ కారణమున నలిని నేడు విచారములో మునిగియున్నది. ఒక్క తొడిమను పూచిన రెండుపూలవలె వారిరువురు వర్ధిల్లు చుండిరి. కుమారసింహుడు యుద్ధమున కరిగినచో నలిని

ఏకాకినిగా నెట్లుండగలదు? ఆ తలంపు మనసునకు దగిలి ఆమె నేత్రములనుండి బాష్పధార లురలుచున్నవి.

కుమారసింహుడు నలిని నయనములు తుడిచి, "నలినీ! ఎందుకేడ్చుచున్నావు? నేను శీఘ్రముగనే తిరిగి వచ్చెదను" అని యోదార్చినాడు. నలిని ప్రత్యుత్తర మీయక అశ్రుపూర్ణనయనములెత్తి కుమారుని ముఖమువంక చూచుచు నూరకున్నది. కుమారుడు మరల నిట్లన్నాడు: "శత్రువులను సంహారించి మహారాజువల్ల జయమాల్యము బహుమతి నొంది దానిని గొనివచ్చి ఎప్పుడు నీజడలో ముడిచెదనో అప్పుడు" ఇట్లు పలుకుచుండ అతని ముఖ ముద్దీప్తమైనది. నేత్రములు జ్యోతిర్మయములైనవి. అతని చిరవాంఛాకృతకృత్యతయు, ఆబాల్యవర్ధమాన కల్పనా సాఫల్యమును అతని నేత్రములందు రూపొందినట్లైనవి. అతడు మరల మెల్లమెల్లగా, "అప్పుడు— నలినీ—అప్పుడు—" అని మాత్రము పలికినాడు. నలిని సజలనయనములతో కపోలములందు కింశుకములు పుష్పింప చిరునవ్వు నవ్వినది. కుమారునకిక నోట మాట రాలేదు. ఆమె చేతులను తన చేతులతో మృదువుగా పుణుకుచు, ఆనంద పారవశ్యముతో భాసిల్లు సార్ద్రముగ్ధదృష్టితో నతడు హిమాంబుస్విన్న కువలయదలములవలె శోభిల్లు నలినీ నయనములవంక చూడ-నారంభించినాడు. ఆవిధముగా ఎంతకాలము గడచినదో!

కొంతసేపటికి కాయుపత్యకామార్గమున సైన్యకోలాహలమును, అశ్వఖురధ్వనులును, ఢక్కాభేరీవాద్య నిర్ఘోష

షులును వినవచ్చెను. కుమారుడు స్వప్నోత్థితునివలె ఉలికిపడి లేచి, "అదిగో రాజధానినుండి సైన్యము వచ్చుచున్నట్లున్నది. చూడ బోవుదము రమ్ము" అని పలికినాడు.

ఉభయులును మార్గసమీపమునకు వచ్చి నిలుచుండిరి.

౨

ఉపత్యకామార్గమున నాడు జనసమూహమున కంతు లేదు. వారి కోలాహలము మిన్ను ముట్టుచున్నది. పర్వత పాదమందలి ఆ చిన్ని గ్రామములో అంత జనతయు, అంత ఉత్సాహమును, అంత కలకలమును అదివర కెన్నడును సంభవించియుండ లేదు.

రాజధానినుండి సైనికులు సాస్త్రులై సుసజ్జితములగు హయము లెక్కి వచ్చుచున్నారు. నిరంతర శ్రేణిగా వెడలి పోవుచున్నారు. వారి భల్లఫలకములపై భాస్కరకిరణములు పడి జ్యోతిస్ఫూలికలను విసరుచు కనులు మిరుమిట్లు గొల్పుచున్నవి.

ఆ గ్రామములోనివా రందరు నాడు వారి వారి గృహములు విడిచి సైన్యసన్నాహమును జూచు వేడుకతో మార్గమువద్దకు వచ్చి యున్నారు. నలిని అ నూతనమహాదృశ్యమును జూచి ముగ్ధురాలైనది. అందుచేత ఆ జన స్రోతోవేగముచే కుమారసింహు డెప్పుడు తన పార్శ్వమునుండి తొలగిపోయినాడో ఆమె తెలిసికొనలేకపోయినది.

ఉన్నట్లుండి నలిని నేత్రములు భయవిహ్వాలములై చకిత కటాక్షములు వెలార్చినవి. ఆమె సుకుమారశరీరము లేతతీవవలె కంపించినది. విశృంఖలాశ్వ మొకటి జనసమూహా మును ఛిన్నభిన్నము చేయుచు దుముకుచు వచ్చుచున్నది. ఇంక నొక్క క్షణము నలిని అట్లే కదలకయుండినచో అశ్వ పాదములక్రింద బడి నలిగిపోయియుండును. బాలిక భయముచే పెద్దపెట్టున అరచి మూర్ఛితయై పడిపోయినది. క్రింద పడినదో లేదో, తోడనే హయారోహి యొక డొక్క నిమేషములో క్రిందికి దూకి ఆమెను బుజముమీాది కెత్తుకొని పోయెను.

బాలిక మూర్ఛ తెలిసి కనులు విప్పి చూచినది. తాను పండుకొనియున్నది తన పితృగృహామే అని గుర్తించినది. తోడనే ఆమె కాశ్చర్యముకలిగినది. తరుణవయస్కుడగు సుం దరపురుషుడొక డౌత్సుక్యపూర్ణదృష్టితో ఆమె ముఖమువంక చూచుచున్నాడు.

మూర్ఛితావస్థలో నలినిని పితృగృహాము చేర్చినది అజయసింహుడు. ఆమెకు స్వాస్థ్యము కలిగినంతనే తండ్రి కృత జ్ఞతాసూచకముగా ఆమెను అజయున కిచ్చెద నని వాగ్దానము చేసినాడు.

ఇది జరిగిన నాటినుండి నలిని భావము మార్పుచెంది నది. ఆమె అధరమున సహజమందహాసము ప్రస్ఫుటిత మగుట లేదు. నేత్రములందు స్వాభావికజ్యోతి ఉద్దీపించుటలేదు.

## 3

కుమారసింహుడు నదీతీరమున వకులవృక్షచ్ఛాయలో ఒంటరిగా కూర్చుండి రెండు మూడు సారులు తల యెత్తి చూచినాడు. వృక్షతలమున పుష్పములు రాలి పడియున్నవి. మాల గ్రుచ్చుటకై నలిని ఎంత సేపటికిని రాలేదు.

నలిని వెనుకటి విధమున విహారమునకు వచ్చుటలేదు. ఎప్పుడైన వచ్చెనేని మొగము ముడిచికొని కూర్చుండును. కాని మనసు విప్పి కుమారునితో నవ్వుచు మాటాడదు. పూలు ఏరుకొనివచ్చి దండలు గ్రుచ్చి కుమారుని కంఠమునం దుంచదు. కుమారుడు పుష్పము లేరి తెచ్చి యిచ్చినను వెనుకటివలె నవ్వుచు ఉత్ఫుల్లనయనములతో సానురాగకటాక్షము లాతనిపై విసరుట లేదు. కుమారు డెన్ని విధముల ప్రయత్నించినను ఆమె ముఖమున సరలానురాగాంచిత దరహాసము మొలకెత్తుట లేదు.

నలినీ కుమారసింహు లిరువురును ఒక్కచోట పెరిగినారు. ఒక్కచోట ఆడుకొన్నారు. తమ జీవితములు దృఢ సూత్రబద్ధములు, అచ్ఛేద్యములు అని భావించినారు. వారిలో ఒకరి హృదయము దాపరికము లేకుండ ఇంకొకరికడ ప్రకాశితమగుచుండును. అన్యోన్యానురాగవిషయమున ఒకరిమీద నొకరికెన్నడును అవిశ్వాసము లేదు. అట్లయిన వారి కింత వరకును వివాహమేల కాలేదు? కాకుండుటకు కుమారుడే కారణము. కుమారుడు నలిని పాణి గ్రహించుటకు తగిన

యోగ్యత సంపాంచి తదుపరి ఆమె తండ్రికడ నామె నభ్యర్థింప నుద్దేశించినాడు.

ఇప్పు డతని కోరిక పూర్తియగుటకుతగిన తరుణము వచ్చినది. ఈ యుద్ధమున వీరత్వగౌరవము సంపాదించుకొని వచ్చి నలినీకంఠముననమర్పించి ఆమె కరములనుండి వర మాల్యముగ్రహింపవలె నని అతని మనోరథము. తదవలం బనమున భవిష్యజీవితములో స్వప్నసౌధములెన్నో నిర్మించు కొన్నాడు. కాని అతని మనోరథమాకస్మికముగా తలక్రిందైనది. స్వప్నసౌధములు వజ్రాహతములైనవి. కల్పనాస్వప్నము నుండి కనులు తెరచునప్పటికి నలిని తొలగి పోయి అజయసింహుని హస్తగత మైనది.

కుమార సింహుడు తదేకచిత్తముతో నలిని రాక కోసము నిరీక్షించినాడు. యుద్ధమునకు వెళ్ళక పూర్వము ఆమె నొక్కసారి చూడవలెనని అతని మనస్సు తహతహ లాడినది. తరువాతనో ! తరువాత నత డామెను మరచి పోగలిగినచో స్వదేశమునకు—స్వగ్రామమునకు తిరిగి వచ్చును. లేనిచో ఇదే కడసారిచూపు అగును.

కుమారు డెంత ప్రయత్నించినను నలినిని మరచి పోలేడు. అతని జీవితములోని ఆశాజ్యోతి ఆరిపోవుచున్నదను మాట సత్యమే. కాని అదే అతని జీవితసర్వస్వమా? కాదు— అది యొకటియేకాదు. సమరాంగణమున శత్రుసమూహ మును సంహరించి వీరయశస్సు సంపాదించుట ఆబాల్యప్రవృద్ధ మైన అతని ఆకాంక్ష.

బాల్యమున తల్లియొడిలో గూర్చుండి దుష్టులగు యవను లొనర్చిన ఘోరకృత్యములు విని విని అతని రక్త ముత్తప్తమైనది. శత్రుశోణితముతో శరీరము రంజితము చేసికొని జనకునివలె వీరనామమును-వీరగౌరవమును పొంద వలెనని అతని ప్రతి రక్తనాళమునుండియు కాంక్షాజ్వాల ప్రజ్వలించుచున్నది. మరి నలినీప్రణయమో! అదియు బాల్యమునుండి దినదిన ప్రవర్ధమానమైనదే! కాని అట్టి ప్రేమకూడ ఆజ్వాలను జల్లార్పలేదు సరికదా ఇంకను వృద్ధి నొందించినది. యుద్ధములో జయమును వీరకీర్తియు నలినీ పాణిగ్రహణమునకు సాధనములని అతడు సంభావించినాడు. అందుచేత యశోవాంఛయు ప్రేమాకాంక్షయు అతని హృద యమున అపూర్వ సమ్మేళనము నొందినవి.

ఉన్నట్లుండి అజయసింహుడు గండుపిల్లివలె వచ్చి ఒక దానిని హరించినాడు. ఇక కుమారునకు యశోవాంఛిత మొకటియే మిగిలినది. అది యొకటియే నే డతని జీవిత సర్వ స్వముగా-సమస్త కల్పనాసారముగా నిలిచినది. అతనిప్రేమా కాంక్ష ఇక పూర్తియగు నాశ కనబడలేదు. నలిని అజయు నకు వాగ్దత్తయైనది. కాని కుమారుని మరచిపోయినదా? ఆమె హృదయములో కుమారుడు మెలుగుచున్నాడా? ఏది ఎట్లయినను యుద్ధానంతరము అజయసింహుడు వచ్చి నలినిని వివాహమాడి కొనిపోవునుగదా!

కుమారు డట్లే కూర్చుండియున్నాడు. నదీజలము కల కల నాదముతో వెనుకటి వలెనే ప్రవహించుచున్నది.

పూర్వమువలెనే ఆకాశము సంధ్యారుణాలోకములో సువర్ణ పుష్పిత మగుచున్నది. మునుపటివలెనే సోత్రస్వినీవక్షము రాగరంజితమగుచున్నది. అదివరకువలెనే వటవృక్షశాఖ యొకటివంగి సువర్ణప్రవాహముమీద కృష్ణచ్ఛాయలు ప్రసరింప జేయుచున్నది. కుమారుడు ఛాయాప్రకాశములందలి తరంగాందోలన చిత్రగతులు తదేకదృష్టితో వీక్షించుచున్నాడు.

సాయంతన శోణశోభలు క్రమముగా మందగించు చున్నవి. చీకటులు దూరదూరమునుండి తొంగిచూచు చున్నవి. ఆసమయమున మర్రికొమ్మనీడలో మరియొక కృష్ణ చ్ఛాయ బింబించినది. దానిని జూచినంతనే కుమారుని హృదయ మొక్కసారి సశబ్దముగా నెగిరిపడినది. అతడా నూతనచ్ఛాయవంక నిదానించిచూచి తలయెత్తినాడు; నలిని ప్రత్యక్షమైనది. తోడనే తరుతలమునుండి లేచి మెల్లమెల్లగా వటవృక్షమూలమున కరిగి అతడు ఆమె సమీపమున నిలబడినాడు.

బాష్పధారాపంకిలమైన నలిని విషణ్ణవదనమునకు పశ్చిమాశాశోణశోభలు సముజ్వలమధుర భావము నాపాదించినవి. క్రమముగా అరుణకాంతులు తమోమిశ్రితములైనవి. ఆమలిన ద్యుతులవంక జూచుచు నలిని విలపింపదొడగినది. ఇతఃపూర్వము నలిని కంట తడిపెట్టిన కుమారుడు సహించెడివాడుకాడు ఇప్పుడును అతని ప్రాణములు చివుక్కుమనుచునే యున్నవి. అతడు తన దుఃఖమును మరచి ఆమె దుఃఖముకై

దుఃఖించుచు, "నలినీ! ఎందు కేడ్చుచున్నావు? " అని అడిగి నాడు. తోడనే నలిని ఆవురుమన్నది.

నలినీ కుమారుల శరీరములు భిన్నములుగాని హృదయము లొక్కటియే-ప్రేమ యొక్కటియే - విశ్వాస మొక్కటియే! ఇట్టి ఆకలంకానురాగము నడుమ నేడు అవాంతరము తటస్థించినది. తన్మూలమున నలిని భిన్నపాత్రార్పిత కాబోవుచున్నదని కుమారుడు కుములుచున్నాడు. "ఈ యవరోధము తొలంగించుకొనుట యెట్లు, కుమారునితో పునస్సమాగమ మెట్లు" అని నలిని వేగిపోవుచున్నది.

వారు వారి హృదయము లెంత సన్నిహితము లనుకొన్నారో అంత దూరస్థములైనవి. వారి నడుమ దుస్తరమైన వ్యవధాన మేర్పడినది. కుమారుని చిరాభిలషితము మీాద చీకట్లు గ్రమ్మ నారంభించినవి. నలిని భావిజీవితాలోకము ముందు బలవత్తరమైన నీలితెర వ్రాలుచున్నది. కుమారుడు నలినిని మరచిపోగలడా? అతని హృదయమామెమీాది ప్రణయముతో తొణికిసలాడుచున్నది. నలిని అజయుని ప్రేమింపగలదా? ఆమె తన హృదయ కర్ణికయందు కుమార దివ్యమూర్తిని ప్రతిష్ఠించుకొన్నది. అజయుడు దానిని పెరికివేయగలడా?

నలిని గద్గద కంఠముతో, "కుమారా! " అన్నది కుమారుడు మృదువుగా, "ఏమి, నలినీ!" అన్నాడు.

"అజయుడు నేడు యుద్ధమునకు బయలుదేరునా?"

"అవును"

"నీవుకూడ నేడే వెళ్లెదవా ?"

"అవును"

"మరల నాకు నీ దర్శనము కలుగునా ?"

"కలుగకేమి, నలినీ ! నేను జీవించియుండిన తప్పక కలుగును"

"ఈ దీనురాలి నెప్పుడైన స్మరింతువా, కుమారా ?"

"దీనురాలవా, నలినీ ! నీవు నాజీవితవసంతలక్ష్మివి. నాప్రాణములు పోవుచున్నప్పుడుగూడ నా నాలుక చివర నుండునది నీ మధుర నామమే సుమా! నిన్ను అజయుడు—"

"నన్నా—"

"నలినీ !"

నలిని కుమారుని పాదములమీద వ్రాలినది.

## ౪

ఇక ఆశలేదు. అజయసింహుడు శత్రువాహిని ప్రబల గతిని నిరోధించుట కసమర్థుడైనాడు. శత్రుసేనలు మిడుత లదండువలె మేవాడ సైన్యము చుట్టును ముట్టడివేసినవి. మేవాడ సైనికులు హతబుద్ధులై ఉచ్ఛృంఖల వృత్తులైనారు. కొందరల్లే నిలబడి శత్రుభల్ల ప్రహారముల సహించుచుండిరి. కొందరు బయలులో ఖడ్గములు త్రిప్పుచుండిరి. మరికొందరు సేనాపతి ఆజ్ఞ నుల్లంఘించి పిక్క బలము చూపుచుండిరి. రాజపుత్ర సైన్యమునకు నాలుగువైపులను భయమును, నిరాశయు నాశమును హాహాకారమును ఆవరించినవి. అజయసిం

హుండు నిరుపాయుడై సంధికోసము దూతలను బంపినాడు. యవన సైనికులలో సదర్పజయధ్వానములు బయలువెడలినవి.

కుమారసింహు డింతవరకు తన రెండువేల సైనికులతో ఇంకొక దిక్కున శత్రువులతో పోరి జయించినాడు. అదృష్ట వశమున నత డట్టి సమయమున అజయసింహునకు సహాయముగా నరుదెంచినాడు. విజయోత్సాహపూరితు లగు కుమారుని సైనికులను జూచియు, వారి జయఘోషలు వినియు పలాయనోన్ముఖమైన అజయసింహుని సైన్యమంతయు క్రమముగా తిరిగివచ్చి శ్రేణీబద్ధము కాదొడగినది.

కుమారసింహుడు జయోన్మాదముతో ఒక సైనిక దళమునుండి యింకొక సైనికదళమున కెదురై వారిని ప్రోత్సహించి ఆజ్ఞాపింపసాగెను. సైనికు లందరు మహోత్సాహముతో జయధ్వనులు చేయుచు ప్రబల ప్రతాపమును ప్రకటించుచు నానా విధాస్త్రములతో శత్రువరూధినిపై బడిరి. భాగ్య స్రోతము మరలినది. ఈసారి యవన సైన్యములో నిరాశాభయ సంభ్రమ నాశములు అలముకొన్నవి. యవన సేనాపతి పారిపోయినాడు. సైనికులు చెల్లాచెదరై పారిపోయినారు.

కుమారసింహుడు పారిపోవుచున్న సేనాపతి వెంటబడినాడు. సేనాపతి ఆహతాశ్వము కొంతదూర మరిగి క్రిందపడిపోయినది. కుమారసింహుడు గుఱ్ఱము దిగి సమీపమున కరిగి చూడ సేనాపతి సంజ్ఞాహీనుడై పడియున్నాడు. తన

వెంటనున్న సైనికులకు అతనిని గొనిరండని ఆజ్ఞయిచ్చి కుమారుడు శిబిరాభిముఖుడై బయలుదేరినాడు.

మార్గమధ్యములో నొకానొక వృక్షతలమున అజయసింహుడుండుట గమనించి కుమారుడచటికిబోయి చూడగా అజయుడు ఖడ్గాహతుడై నిస్సహాయుడై పడియున్నాడు. అజయునకును అతనికిని నాలుగైదు బారలు వ్యవధానము. ఆసమయమున యవన సైనికుడొకడు అజయుని లక్ష్యము చేసి బల్లెము విసరినాడు. అది కనిపెట్టి కుమారుడు విద్యుద్వేగముతో దూకి తన శరీరముతో అజయుని శరీరము నాచ్ఛాదించినాడు. తోడనే అతని శరీరము భల్లవిద్ధమైనది. అతడు భూమిమీద పడిపోయినాడు. క్రింద పడినంతనే అతనికి అశ్రుప్లావితమైన నలినీ విషణ్ణవదనము కనబడినది.

౫

యుద్ధ విజయానంతరము అజయసింహుడు ససైన్యముగా రాజధానికి తిరిగి వచ్చినాడు. ఆహతుడైన కుమారసింహుని గూడ నచటికి గొనివచ్చినారు. బల్లెపు దెబ్బవల్ల అతనికి వెంటనే మరణము కలుగలేదు. కాని జీవించుననునాశ గూడ అత్యల్పము.

సంసారము ఇంద్రజాలము. అదృష్టము ఐంద్రజాలికుడు. ఏ యద్భుత కౌశలముతో ఆ మాయావి చిత్ర విచిత్ర నాట్యములు సల్పునో అది దేవతలకే తెలియరానిది. ఇక మాన

వుల విషయము చెప్పవలసిన దేమున్నది! యథార్థముగా కుమారసింహుని వల్లనే యుద్ధమున విజయము సమకూరినది. కాని అజయసింహుని యశోగీతములచే రాజధాని ప్రతిధ్వనించినది.

అధికార ప్రభావ మసామాన్యము. అది విజృంభించి నపుడు దానికి ప్రతికక్షిగా న్యాయము గూడ తలయెత్తలేదు. అందుచేత కుమారుని సైనికులు అజయవిజయ ప్రశంసకు విరుద్ధముగా యథార్థము వచించుటకు కూడ సాహసింపలేక పోయిరి. యథార్థ కధనమే యైనను అజయును చెవి జేరినేని అతడు క్రుద్ధుడై అందుకు తగిన శాస్తి చేయునని వారి భయము. మొదటమొదట కుమారుని సైనికులు యథార్థము బయలుపరచుటకు భయపడలేదు. కాని రాజధాని ప్రజలు వారి మాటలు విని వారిని పరిహసింపసాగిరి. అది యట్లుండగా అజయసింహుని సైనికు లా పలుకులు విని తద్వక్తలను బెదరించి దండింపదొడగిరి. తరువాత కుమారుని సైనికులు వారిలో వారు రహస్యముగా విజయవిషము ప్రసంగించుకొనుచు ప్రకాశముగా అజయుని ప్రతాప ప్రశంస వచ్చినప్పుడు కృత్రిమోత్సాహముతో జయధ్వనులుచేయుచుండిరి.

కుమారుడు శయ్యాగతుడైనాడు. అందుచేత యోగ్యతా రాజ్యమునకు దూరగుడైనాడు. అతని పక్షము వహించి అజయుని క్రోధానల జ్వాలలు సహింప నెవ్వడు పూనుకొనును?

నాడు రాజధానిలో మహోత్సవము. మహారాణా సేనా పతికి బహుమానము చేసి గౌరవించును. దుర్గప్రాంగణమున మహాసభ సమావేశమైనది. మంత్రులు, సామంతులు, రాజ కీయోద్యోగులు సేనాధిపతులు మున్నగువారు సభ నలంక రించిరి. సైనికులు నాగరకులు మొదలైనవారు మహోత్సా హముతో విస్ఫారిత నయనములతో సభను పరివేష్టించి యుండిరి.

మహారాణా సింహాసనమునుండి లేచి వజ్రఖచిత శీర్షము గల చంద్రాయుధమును కోశమునుండి బయటికి తీసి, "సేనా పతి అజయసింహా! నీ పరాక్రమ ప్రభావము వలన నేడు మన మేవాడ దేశము శత్రు విముక్తమైనది. నీవు నిర్వహించిన యీ మహా కార్యమునకీ రాజఖడ్గము యోగ్యమైన పుర స్కృతి కాదు. ఇది కేవలము—"

రాణావాక్యము పూర్తి కాకముందే దర్శకమండలి నుండి జయ జయ ధ్వానములు బయలుదేరి దిగంత విశ్రాంతము లైనవి. ఆ శబ్దము సమసిపోయి పోవకముందే వృద్ధసైనికు డొకడు గబగబ ముందుకు వచ్చి పెద్ద గొంతుకతో, "మహా రాణా! తమరు ఏ కార్యనిర్వహణమునకు గాను ఎవరిని సత్కరించుచున్నారో ఆయన యథార్థముగా దానికి అధికారి కాడు. అజయసింహుడు యుద్ధమున గెలుపొందలేదు. ఆయన పరాజితుడై సంధిచేసికొన దూతలను బంపినప్పుడు మా ప్రభువు, కుమారసింహుడు నిజబాహు బలముచేత యుద్ధ ములో విజయము సంపాదించినాడు" అని విన్నవించినాడు.

నాలుగు వైపులు విస్మయా విష్టములై నిస్తబ్ధములైనవి. అజయుని ముఖము రక్తవర్ణమును దాల్చినది. మహారాజు ఏమి చేయుటకును తోచక, చంద్రాయుధమును మరల కోశ బద్ధము చేసి, "సేనాపతీ! ఇతడు పలికిన పలుకు లెంతవరకు సత్యములు ?" అని అడిగినాడు.

అజయసింహుని ముఖమందలి రక్తవర్ణము వివర్ణ మైనది. అజయుడు క్షత్రియుడు. అతని నోటివెంట అసత్య వాక్యము లెట్లు రాగలవు ? ఆయశస్సును ఆ గౌరవమును తనదే ననుకొని ఎవడు నిశ్శంకముగా అనుభవించుచున్నాడో, ఈ క్షణమువరకు ఒక్క క్షణమునగూడ అది అన్యథనమను స్ఫురణముగూడ లేకుండ ప్రవర్తించినాడో, ఆ అజయ సింహుడు ఆయశోగౌరవములను పట్టుబడినంతనే దొంగవలె చటుకున వదలిపెట్టి పారిపోవునా ?

మొదట నతడప్రతిభుడైనాడు. కాని అది క్షణ కాలము మాత్రమే. తరువాత సంబాళించుకొని, చక్కగా నాలోచించుకొని, "మహారాజా! ఎవడు నా మీద దోషా రోపణ చేసినాడో అతడే తాను చెప్పినది సప్రమాణముగ ఋజువుచేయవలెను. స్వవిషయమున స్వవాక్యములు ప్రమా ణములు కాజాలవు గదా !" అని పలికినాడు.

అజయసింహు డంత గొప్పగా మాటాడినందుకు సభా స్తారు లందరు సాధువాదము చేసినారు.

మహారాణా, "సైనికా! మీ ప్రభువు యుద్ధములో జయించినాడంటివి గదా! అందుకు ప్రమాణమేమి!" అని ప్రశ్నించినాడు.

రణజిత్సింహుడు కంఠమున సత్యబలము సమకూర్చుకొని, "ప్రమాణమా, మహారాజా! నా మాటలే ప్రమాణము. నేను క్షత్రియుడను" అని గంభీరముగా సమాధానము చెప్పినాడు.

మహారాణా—"సత్యమే! కాని అజయసింహుడు గూడ క్షత్రియుడే. నీవు చెప్పినది సత్యమగు నెడల అతడు చోరుడు కావలసివచ్చును."

రణజిత్సింహుడు—"(క్రోధము, నిగ్రహించుకొనలేక) ప్రాణరక్షకుని ప్రతాపమును హరించి తత్ప్రకాశముచే కాచఖండమువలె వెలుగుచున్న ఈఅజయసింహుడు చోరుని కన్నను అధముడు. కుమారసింహుడు తన ప్రాణము లడ్డుపెట్టి ఆయన ప్రాణములు రక్షించినాడు."

మహారాణా— "(క్రుద్ధస్వరముతో) సైనికా! అధిక ప్రసంగము చేయవద్దు. ఇది రాజసభగాని సంతర వీధికాదు. ప్రమాణమేదైన ఉన్నచో చూపుము. లేకున్న వెడలిపొమ్ము."

రణజిత్సింహుడు—"మహారాజా! కుమారసింహుని రెండు వేలమంది సైనికులు ఇందుకు ప్రమాణము."

మహారాణా—"రెండు వేలమంది అనావశ్యకము. ఇద్దరిని పిలువుము."

రణజిత్సింహుడు సైనికుల బిలుచుటకు బయలుదేరినాడు. అప్పుడు మహారాణా, "నీవు పిలుచుట కూడదు. ప్రతీహారీ ! నీవుపోయి పిలువుము" అని ఆజ్ఞాపించినాడు.

ప్రతీహారి జనసమూహములోనికిబోయి పెద్ద గొంతుకతో, "కుమారసింహుని సైనికులెక్కడ నున్నారో— ఇద్దరిక్కడికి రండు. మహారాజు నెదుట సాక్ష్యమీయవలెను" అని ఘోషించినాడు.

కుమారసింహుని సైనికులలో భయసంభ్రమా ధైర్యములు ముప్పిరిగొన్నవి. వారిలో ప్రతి వ్యక్తియు, "అజయసింహునకు వ్యతిరేకముగా నేనన్న మాటలు బయలు పడినవి కాబోలు అందుచేతనే ఆవిషయ మిప్పుడు విచారణకు వచ్చినది. మొదట సాక్ష్యము తీసికొందురు. తరువాత ప్రాణదండము విధింతురు. దుర్మార్గులైన యధికారులతోడి విరోధము పాముపగవంటిది. ఈ సందర్భములో రాజకీయకోపమునకు నేనేల గురికావలెను" అని తలపోసి ఎవరికివారు నిమ్మకు నీరెత్తిన ట్లూరకుండిరి.

మరల ప్రతీహారి, "కుమారసింహుని సైనికులలో నిరువురను మహారాణావారు పిలుచుచున్నారు. ముందుకు రండు" అని బిగ్గరగా కేక వేసినాడు.

అంతటను నిశ్శబ్దము. ఎక్కడను ఎవ్వడును కదల లేదు. ప్రతీహారి మహారాజు వద్దకు వచ్చి, "మహారాజా ! కుమారసింహుని సైనికు లెవ్వరును ఇక్కడ లేరు కాబోలు.

ఎంత పిలిచినను ఒక్కరును పలుకలేదు." అని విన్నవించినాడు.

రణజిత్సింహుడు కోపముతో మండిపోయినాడు. కాని ఏమియు మాటాడలేదు. మహారాజు, "సైనికా! నీకు ఇతర ప్రమాణములేవైన గలవా?" అని మరల ప్రశ్నించినాడు.

రణజిత్తు, "మహాప్రభూ! ఇక మా ప్రభువు కుమారసింహుడే ప్రమాణము. ఆయన సాక్ష్యము గ్రహింప వేడుచున్నాను" అని మనవి చేసినాడు.

రణజిత్తు పలుకుల కజయుడించుక అప్రతిభుడై, వెంటనే తెప్పిరిల్లి, ముఖవికారముబయలుపడనీయక, "కుమారసింహుడిప్పుడు శయ్యాగతుడుగా నున్నాడు గదా! ఇక్కడికి గొని వచ్చినచో ఆయనకు ప్రమాదము సంభవించునేమో అని ఆశంకించుచున్నాను" అని వచించినాడు.

రణజిత్తు అతని భావమును గ్రహించి గంభీరముగా, "క్షత్రియుడైన వానికి ప్రాణముల కన్నను వీరనామ వీరయశస్సులు అమూల్యములు. అందుచేత కుమారసింహుని సునామ రక్షణార్థము మహారాణావారాయనను ఇచటికి తెప్పించ వేడుచున్నాను" అని పలికినాడు.

మహారాణా, "సరే, శిబిక ఏర్పాటుచేసి ఆయనను ఇచటికి తెప్పింపుము" అని వక్కాణించినాడు.

రణజిత్తును ఇరువురు ప్రతీహారులును కుమారసింహుని గొనివచ్చుటకు బయలుదేరినారు. రణజిత్తు ప్రతీహారులతో, "శిబిక యొకటి మెత్తని పరువులతో సిద్ధపరచి తెండు" అని చెప్పి, తాను కుమారసింహుని వద్దకు బోయినాడు.

అత డింటిలోనికి బోయినంతనే కుమారుడు కనులెత్తి చూచి, "రణజిత్ ! ఇంతసేపటినుండి నీ వెక్కడికి వెళ్లితివి ? ఎన్ని కేకలు పెట్టినను ఎవ్వరును పలుకలేదు" అన్నాడు.

రణజిత్తు విషణ్ణవదనముతో, "ప్రభూ ! నేడు అజయసింహుడు మహారాణావారి హస్తములనుండి యుద్ధవిజయ బహూకృతి నొందు నని వింటిని. యథార్థవిజయి శయ్యాగతుడైనాడు. ఆయన వీరనామ మెవ్వరి నోటను వినబడుట లేదు. పాపండు డజయసింహు డసత్యము లాడి అన్యాయముగా తద్గౌరవలాభము నొందబోవుచున్నాడని విన్నంతనే నేను సహింపలేకపోయితిని. మిమ్ము ఒంటిగా గూడ వదలి సత్యమును రాజసభయందు ప్రకటింప బోయితిని" అని భక్తి క్రోధ దుఃఖములు ముప్పిరిగొన వెల్లడించెను.

కుమారసింహుడు విస్మయావిష్టుడయ్యెను. తాను పొందవలసిన గౌరవము నజయసింహు డకుంఠిత చిత్తముతో గ్రహింపనున్నా డన్నమాట అతనిని నిస్తబ్ధుని జేసినది.

రణజిత్తు దీనముగా, "ప్రభూ ! మహారాణా నా మాటలు విశ్వసించలేదు. మీరు సాక్ష్యమిచ్చుటకు రావలెను" అని వేడినాడు.

కుమారసింహుని సర్వాంగములు క్రోధముచే కంపించినవి. "నా ప్రాణప్రియను గ్రహించుటయే కాక నా సాహసముచేత – నా సామర్థ్యముచేత ఏ వీరనామమును, ఏ వీరయశస్సును సంపాదించుకొంటినో దానిని గూడ దొంగవలె వచ్చి గ్రసించి నన్ను మోసగించ నుద్యుక్తుడైనాడా!" అని తలపోసి అతడు తన బలహీన స్థితిని మరచి అత్యంతావేశముతో చటుకున లేచి కూర్చుండినాడు. తత్ఫలితముగా వక్షముమీది గాయము రక్తస్రావితమైనది. మరల నతడు మెల్లమెల్లగా వండుకొని, "రణజిత్! శిబికను గొనిరా. నేను రాజసభకు వచ్చెదను" అని పలికినాడు.

కొంతసేపటికి శిబిక యొకటి వచ్చి కుమారసింహుని రాజసభకు గొనిపోయినది. శిబిక మీది యాచ్ఛాదనము తీసివేసినంతనే సభలోని ప్రతి నేత్రమును కుమారుని క్షీణోదార వీరమూర్తిని తిలకించి ప్రశంసాభావమును ప్రకటించినది. కుమారుడు మాత్ర మొక్క అజయసింహుని మీదనే తీవ్ర దృష్టి బరపినాడు.

కుమారుని శిబికను మహారాణావారి సమీపమునకు చేర్చినారు. అప్పుడు మహారాణా అతనితో ఇట్లు పలికినాడు: "కుమారసింహా! నీవు మృత్యుజిహ్వాగ్రమున శయనించి యున్నావు. నీవు పలోకమునకు బోవుచున్నావో అచటికి ఈ పార్థివ యశోగౌరవములు నీవెంట రావు. వెంట వచ్చునది ఒక్క సత్యమే! అది యొక్కటే ప్రాణసఖునివలె నంపదలందును ఆపదలందును విడనాడక వెంటనుండునది. సత్యమే

పరమేశ్వరుఁడు. అట్టి సత్యమును స్మరించుచు యథార్థము వచింపుము—యుద్ధమున విజయి ఎవరు ? నీవా, అజయ సింహుఁడా ?"

కుమారుఁడు ప్రత్యుత్తరము చెప్పుటకు ముందు అజ యునివంక చూచినాఁడు. అజయుని ముఖము శుష్కమై మలిన మైనది. అతని దృష్టులందు దీనత, వెల్లివిరియుచు క్షమింపు మను వేడికోలు ప్రకటితమగుచున్నది. దానిని కుమారుఁడు గ్రహించినాఁడు.

అప్పుడు కుమారుఁడు లోలోపల ఇట్లు భావించినాఁడు: "ఇతనికి ఒకసారి ప్రాణదానము చేసినాను. ఇప్పు డితనిని అవమానించి పగతీర్చుకొందునా ? సత్యము పలుకుట పగతీర్చు కొనుట యగునా ? కాకున్నను దాని పరిణామ మంతే కదా ! పగ ఎవరిమీఁద—నలిని మీఁదనా, అజయుని మీఁదనా ? నలిని మీఁద నెట్లగును ? ఈ దుర్వార్త విన్నపిదప నలిని జనకుడు అజయుని అల్లునిగా నంగీకరింపనిచో ఆమె జీవితము నైరాశ్యా నలముతో నవయవలసినదే గదా !

"నలిని నిజముగా అజయుని ప్రేమించినదా ? ప్రేమింప కున్నను ధర్మవిధి ప్రేమకన్న శిరోధార్యమైనది. అట్లయిన ఈ వార్త నలిని చెవి జేరుట కవకాశము లేదు. అధికారము ఎట్టి దుర్గుణములను, దుష్కీర్తులను మట్టుపెట్టగలదు గదా ! అయి నను గుణము కుంకుమ బొట్టువలె చెరగిపోవును. దుర్గుణము కాలిన మచ్చవలె నిలచిపోవును. సత్యము దాగదు. ఎప్పుడో

ఒకప్పుడు బయటపడక మానదు. కనుక వివాహానంతరము అజయుని అవమానము విన్నను నలినికి హృదయజ్వాల తప్పదు. "నలిని అదృష్టవంతురాలే, కాని భర్త పట్టి నీచుడు సుమా! అసత్యమాడి మోసముచేసి గౌరవము సంపాదించుకొన్నాడు;" అని ఇరుగు పొరుగువారాడుకొను మాటలామె కెట్టి తలవంపులు, ఎట్టి ఘోరయాతన కలిగించును? కనుక నలిని సుఖమున కెట్టి యభ్యంతరమును కలుగరాదు."

ఇట్లు భావించుచుండగా కుమారునకు కడసారి చూచిన నలిని బాష్పప్లావిత ముఖము మనఃఫలకమున పొడకట్టినది. తరువాత నతడు అజయునివంక చూచినాడు. అజయుని వదనము దీనముగా క్షమాప్రార్థనము చేయుచునే యున్నది. కుమారునకు జాలి కలిగినది. అప్పుడతడు ప్రతిగ్రహముకన్న దానమే మహత్తరమైన దని నిశ్చయించుకొన్నాడు. తోడనే అతని వదనము ప్రసన్నమైనది. అతని ఆత్మసంతృప్తి నొందినది.

"కుమారసింహా! ఏమి దీర్ఘముగా నాలోచించుచున్నావు? సత్యకథనమునకు సంశయమెందుకు? చెప్పుము - నిజముగా గెలిచిన దెవరు?" అని మహారాణా మరల నడిగినాడు.

కుమారసింహుడు ధీరస్వరముతో, "సంశయ మేమాత్రమును లేదు, మహాప్రభూ! సత్యకథనము కోసమే ఇచటికి వచ్చితిని. సత్యమే ఈశ్వరుడని తాము సెలవిచ్చినారు. కాని అనర్థ సత్య మాడరాదని అభియుక్తు లన్నారు. అది యట్లుంచి ప్రలోభమును నిగ్రహించుట మానవులకు దుస్సాధ్యము, మహారాజా!" అని పలికినాడు.

అతని పలుకులలోని మందహాస రేఖలు మహారాణా గ్రహింపలేదు. అందుచేతనే ఆయన ఇంచుక ఆశ్చర్యముతో, "మృత్యుముఖ గహ్వరము ప్రవేశింప నున్నప్పుడు కూడ నా?" అన్నాడు.

"అవును, మహారాజా! ప్రాణములు కంఠగతములై నప్పుడు కూడ."

"అట్లయిన నిన్నిక ప్రశ్నించి ప్రయోజనము లేదు. అజయసింహునకు బహూకృతి ప్రదానము జరుగును గాక!"

"అట్లే జరుగును గాక! అయితే ఒక్క ప్రార్థన."

ఏమది?"

"అజయసింహునకు దక్షిణహస్తముగా నుండి పోరాడి యుండుటచే విజయ ప్రఖ్యాపనము చేయుటకు ఈ ముహూర్తపు అనుజ్ఞ వేడుచున్నాడు. తమవరి మహారాణావారి పురస్కృతి."

అట్లే జరుగును గాక!"

కుమారుడు మందహాసముతో అజయసింహుని వంక చూచినాడు. అజయుడు లజ్జా విఘూర్ణమాన నయనములు క్రిందికి వాల్చినాడు. రణజిత్సింహుడు కుమారుని ఉద్దేశమును గ్రహించి ఆతని మహాత్వమున కానందాశ్రువులు విడిచినాడు. మహారాణా ఏమియు అర్థము కాక నిర్నిమేష దృష్టులతో వీక్షించుచున్నాడు. బుద్ధిమంతు లగు సభాస్తారులు ఉభయుల వైఖరిని గ్రహించి కుమారుని యౌదార్యమునకు ప్రశంసా బాష్పభరిత నయనులైనారు.

అప్పుడు కుమారుడు, "సేనాపతి అజయసింహా! ఒక్కసారి ఇటు దయచేయుడు" అన్నాడు.

అజయుడు దగ్గరకు వచ్చినాడు. కుమారుడు ప్రక్కనున్న ఖడ్గమును దీసి మెల్లగా కోశవిముక్తము చేసి పట్టుకొని, "అజయసింహా! ఈ ఖడ్గము వీరుడని ప్రఖ్యాతి నొందిన నా జనకునిది. ఇది అకలంకితమైనది. శత్రురక్త రంజితమైనది. దీనిని మీ విజయఖ్యాపన చిహ్నముగా ఈ సేవకు డర్పించుచున్నాడు. త్రికరణశుద్ధిగా నొసగుచున్న ఈ చిన్ని కానుకను పరిగ్రహింపవలె నని ప్రార్థించుచున్నాను" అని పలుకుచు ఖడ్గము అజయున కొసగినాడు.

వేయి బాకు లొక్కసారి పొడుచుకొన్నట్లున్నను, అజయుడు వంచిన తల యెత్తకుండ మోకరించి కుమారుని ఖడ్గము గ్రహించి కనుల కద్దికొని లేచి యథాస్థానమున నుపవిష్టుడై నాడు.

సభయంతయు నిశ్శబ్దము. ఎచ్చటను ఉచ్ఛ్వాస నిశ్శ్వాస శబ్దముకూడ వినరాలేదు.

తరువాత మహారాజు లేచి ఉచ్చైస్స్వరముతో, "సేనాపతి అజయసింహుడే విజయి-నిస్సంశయముగా విజయి-ముమ్మాటికిని విజయి!" అని సింహనాదము చేసినాడు.

సభలో నాలుగువైపులనుండి జయజయ ధ్వానములు చెలరేగి మిన్నుముట్టినవి. కుమారుడు స్వపరాక్రమముచేత సంపాదించిన విజయము హృదయపూర్వకముగా అన్యునకు

ధారవోసి, అతని విజయగానము చెవులార విని చిత్తశాంతి సూచకముగా చిరునవ్వు నవ్వినాడు. అతని జీవితలక్ష్యము లగు నలినీప్రేమయు వీరఖ్యాతియు త్యాగములో మహాత్వము నొంది ఆత్మతృప్తిలో సుసంపన్నము లైనవి.

కుమారుడు రణజిత్తును బిలిచి, "రణజిత్! నన్ని చటి నుండి శీఘ్రముగా తీసికొని పొమ్ము" అని చెప్పెను. వాహకులు వెంటనే వచ్చి శిబికనెత్తుకొనిరి. రణజిత్తు కుమారుని మహాత్వము మననము చేయుచు శిబిక ననుగమించినాడు. కుమారు డర్ధమూర్ఛితావస్థలో శయనించియుండ అతని హృదయాంతరములో నెచటనో నలినీస్మృతి మేలుకొన్నది.

మహారాజు బహూకరింప దలచిన వజ్రఖచితముష్టిగల ఖడ్గమును అజయుని కటి ప్రదేశమున బంధించి, "అజయసింహా! నీవు సాధించిన మహాకార్యమునకు సామాన్య ధన రత్నములు యోగ్యమైన పురస్కృతి కాజాలవు. నాగృహమందలి అసామాన్య రత్నమును-ఏ రత్నజ్యోతిచే నా హృదయముగూడ సముజ్జ్వల మగుచున్నదో అట్టి అమూల్య రత్నమును నీకు సమర్పించి కృతార్థుడను కాదలచినాను!" అని ప్రశంసించినాడు.

మరునాడు రాజకుమారి మాయావతికిని అజయసింహునకును మహావైభవముతో కళ్యాణము జరిగినది.

౬

యుద్ధము సమాప్తినొందినది. అజయసింహుడు విజయ లాభ మొందినవార్త నగరమందును, రాష్ట్రమందలి ప్రతి గ్రామమునకును వ్యాపించినది. అతని ప్రశంస విని నలిని హృదయ ముత్ఫుల్లమగుటకు మారుగా కంపించినది. ఆమె కాంతిగా విస్ఫారితనేత్రములు ముకుళితములు కాదొడగినవి.

దినములు గడచినవి. వారములు గడచినవి. కుమారుని ఆగమన చిహ్నములు కనబడలేదు. అతని సైనికులు గాని ముఖ్యానుచరులుగాని ఒక్కరైనను కనిపించలేదు. క్రమముగా నలిని వదనమున ఆశాజ్యోతి మందగించి నిరాశామలిన రేఖలు పొడసూప నారంభించినవి. ఆమె ఉత్తప్తహృదయము క్రమముగా శుష్కింపసాగినది.

అయినను ఆమె ఆశ వదలుకొనక సాయంసమయము లందు ఏ నదీతీరమున ఏవకుళవృక్షతలమున గూర్చుండి తానును కుమారుడును పరస్పర హృదయతంత్రులు మేళవించి ప్రణయ రాగము లాలాపించుచుండిరో అచట ఒంటరిగా గూర్చుండి మాటిమాటికి తలయెత్తి కుమారుని రాకకై నిరీక్షించు చుండెడిది. దూరమునుండి సన్నగా అశ్వఖురధ్వని వినబడినంతనే యులికిపడి లేచి విస్ఫారితనేత్రములతో వీక్షించుచుండెడిది. చీకటిపడునంతవరకు ఎదురుచూచి హతాశయై క్లాంతహృదయముతో గృహమునకు తిరిగిపోవుచుండెడిది.

ఒకనాటి సాయంకాలమున నలిని ఆశ పండినది. అస్తమాన సూర్యుడు రాక్షసులను వధించి తద్విజయచిహ్నముగా రక్తరాగాంగుడై పశ్చిమాద్రి నధిరోహించినాడు. శోణ శోభలచే జగమంతయు సిందూరరాగాంచితమైనది. అట్టియెడ గుఱ్ఱపుగిట్టలచప్పుడు బయలులో లీనముగాక క్రమముగా సమీపింపసాగినది. చూడగా నామె ప్రఫుల్లార్ద్ర దృష్టికి జన సమూహము కనిపించినది. ఆమె హృదయ ముప్పొంగినది. పరిశీలింపగా చాలమంది అశ్వారూఢులగు సైనికులు సుస జ్జితమైన శిబికకు ముందువెనుకల శ్రేణీబద్ధులై వచ్చుచుండిరి. నిస్సందేహముగా వివాహము నిమిత్తము కుమారసింహుడే వచ్చుచున్నాడని ఆమె ఊహించినది. ఆయూహలోని ఆనంద మపారము.

శిబిక వచ్చివచ్చి వకుళవృక్షతలమున నిలిచినది. నలిని వృక్షాంతరము మాటున కరిగి చూడదొడగినది. ఎంత సేపటి కిని శిబికారూఢుడు వెలుపలికిరాలేదు. నలిని ఇక విలంబము సహించలేక కంపమాన హృదయముతో తొట్రుపడు నడ కతో శిబికవద్దకు వచ్చినది. రణజిత్సింహుడు మెల్లమెల్లగా శిబికాద్వారము సగము తెరచి లోపలికి తల దూర్చినాడు.

రణజిత్తు కుమారుని భృత్యుడని నలిని యెరుగును. అతని వదనవైఖరిని ప్రవర్తన ప్రకారమును పరికించి నలిని వ్యాకులిత చిత్తయై వ్యగ్రభావముతో ఆవలివైపుకు బోయి తలుపు తెరచి తల పూర్తిగా దూర్చి శిబికాశాయి ముఖము

వంక తేరిపార చూచినది. పరుండినది కుమారుడే అని గుర్తించి అతని ముఖమందలి మృత్యుప్రశాంతిని గ్రహించి ప్రణయ విస్మయ విచారములు ముప్పిరిగొన ఆమె స్తంభించిపోయినది.

కుమారుడు మెల్లగా కనులెత్తి చూచినాడు. తలవని తలంపుగా నలిని వదనము ప్రత్యక్షమైనది. తన జీవితములో నిట్టి భాగ్యము కలుగునని అతడనుకొనలేదు. ఇప్పు డతని హృదయము పరమానంద భరితమైనది. పరమశాంతి లభించినది. అతని చివరి కోరిక సిద్ధించినది. ఆనంద బాష్పము లుప్పొంగుచుండ సాదరముగా మృదుస్వరముతో నతడు, "నలినీ!" అని పిలిచినాడు.

నలిని నిర్నిమేషనయనములు కుమారుని చూచుచునే యున్నవి. కాని మనస్సు ఎక్కడ నున్నదో, ఏయవస్థలో నున్నదో, ఏమి భావించుచున్నదో! కొంత సేపటికి ఆమె ముఖమెత్తి చూచినది. శిబికకు ఆవలివైపున రణజిత్తు అట్లే చూచుచున్నాడు. ఈ దురవస్థకు హేతువేమి అన్నట్లు నలిని దీనముగా నతనివంక చూచినది. రణజిత్తు యావద్వృత్తాంతము పూసగ్రుచ్చినట్లు వినిపించినాడు.

నలిని ప్రమోదసంభ్ర మాశ్చర్యములతో సర్వము విన్నది. ఆమె ముఖమున వ్రేలాడు మలినచ్ఛాయలు అంతర్హితములైనవి. విషాదరేఖలు విచ్చిపోయినవి. క్రమముగా ప్రసన్నత పాదుకొన్నది. తోడనే అపూర్వజ్యోతి యుదయించినది. ఆనందాశ్రువులు దొరలుచుండ, ప్రశంసమాటున

అకళంకానురాగ మతిశయించుచుండ నలిని కుమారునివంక నిశ్చలముగా చూచి చూచి, "కుమారా!" అన్నది.

కుమారుడు— "నలినీ! నీవు సుఖించుచుండ చూచి ఆనందించు నదృష్టము నాకు లేదు."

నలిని—(సప్రేమముగా) "నా సుఖమును, నా ఆనందమును నా హృదయేశ్వరుని తోడివే!"

కుమారుడు—(సందేహముతో) "నలినీ! ....అజయసింహుడు—"

నలిని—(అకుంఠితస్వరముతో) "అజయసింహునకు నా హృదయ మర్పించలేను. ఆయన ఎట్టి వాడైనను నాకు ప్రాణదాత యగుటచేత ఆజన్మాంతము నేనాయనకు కృతజ్ఞురాలను. అంతే!"

కుమారుడు— (సార్ద్రనయనములతో సానునయముగా) "నలినీ! రాజభోగములు—"

నలిని— "కుమారా! హృదయమున కింపులేని భోగములు వృశ్చికదంశనములు. ఇంపైనచో చితానలజ్వాలలు గూడ తుషారశీకరము లగును."

కుమారుడు—(జాలిగా) "నలినీ! ఈముమ్మూర్తునితో—"

నలిని— "కుమారా! ఇహలోకమునందే కాదు—పరలోకమునందుగూడ ఈ దాసి ఈ నీ శ్రీచరణములకు తన హృదయమును పెనవేసికొని యున్నది. పరమేశ్వరుడు కూడ ఆ బంధమును కదలింపలేడు."

కుమారుడిక మాటాడలేదు. మెల్లగా కనులు మూసి నాడు. కనుల కొలకులనుండి ఊటలవలె కన్నీటిధారలు పొరలి నవి. అతని హృదయములో ఎట్టి స్మృతితరంగములు చెల రేగినవో, ఎట్టి భావఝంఝూవాతములు వీచినవో!

కుమారుడు మెల్లగా కనులు తెరచి కంపమాన కర ములతో నలిని మృదుకరములు గ్రహించి తన అర్ధనిమీలి తాక్షులకు అద్దుకొన్నాడు. తరువాత నామె కరములు పుణు కుచు సోద్వేగముగా నిట్లు పలికినాడు. "నలినీ! నా జన్మము ధన్యమైనది. కాని, నలినీ—నలినీ! నీకంఠమున జయ మాల్యము—."

నలిని సంతోషదుఃఖములు సంభ్రమించుచుండ ఇట్లన్నది: "జయమాల్యమా, కుమారా! జయమాల్యము నేడు సువాసనలు వెదజల్లును, రేపు వాడిపోవును, ఎల్లుండి విస్మృతిలో సణగిపోవును. అట్టి జయమాల్యము కోసము విచారించుచున్నావా, ప్రభూ! ప్రాణసంరక్షణము, విజయ దానము, యశస్త్యాగము-ఇవి మూడును దివ్యకుసుమములు-వాడనివి, వాసనలుపోనివి! వీని దివ్యపరీమళము లోకాంత రములందు గూడ వాసించునది. అట్టి అనర్ఘ్యదివ్యకుసుమము లతో ఈ నీప్రియదాసిని సుభూషితను చేసినావుగదా! ఇంక నాకేమి కావలెను!"

అంతవరకును సంతోషాశ్చర్యములతో వినుచుండిన రణజిత్సింహుడు అంజలిఘటించి గద్గదికతో, "తల్లీ, నలినీదేవి!

నీవు మా వీరప్రభువునకు తగిన వీరపత్నివి! ఆహా! వీరులకు వీరపత్నులు దొరకుట ఎంత సుకృతము!" అని నమస్కరించి నాడు.

చీకటులు వ్యాపించినవి. ప్రకృతినిశ్శబ్దమైనది. ఇంతలో నొక సేవకుడు వచ్చి గుడారము తయారైనదని చెప్పినాడు. తోడనే రణజిత్తు కుమారుని గుడారములోనికి జేర్చి అందు సిద్ధము చేసిన శయ్యపై పరుండబెట్టినాడు. నలిని అతని పాద సంవాహనము చేయనారంభించినది.

౭

నదీతీరమందలి శ్మశానవాటికలో చితికి అభిముఖముగా కూర్చుండియున్న ఆలూలాయిత కుంతల, దీనవేష, ఆ రమణి యెవరు? తారుణ్యరేఖలు దందడించు నామె వదనమున సంతోషము రేఖామాత్రము గూడ లేదేమి? ఆమె కోమలహృదయ మప్పుడే నిష్పందము నిరీహము నిరానందము అయినదా? ఆమె అనురాగము ఆకాంక్షలు అప్పుడే ముకుళించుకొని పోయినవా? సూర్యభగవాను డుదయించుచుండగనే, అరుణదీధితు లలరుచుండగనే సంధ్యాశోభలు వెలుగుచుండగనే సద్యోవికసిత నలినీకుమారి శుష్కీభూత కర్ణికయై అప్పుడే విరసపరిణామము నొందినదా?

యుద్ధయాత్రకు ముందు వకుళ వృక్షచ్ఛాయలో గూర్చుండి కుమారుడు నలిని కరములు తన కరములం దుంచు కొని మృదువుగా దువ్వుచు తన భవిష్యజ్జీవితము నామెకు విని

షించినాడు. కల్పనా వీథిలో నలిని సుఖచిత్రములు చిత్రించు కొన్నది. ఆ నలిని స్వప్నమందైన ననుకొన్నదా ఇట్లు సహ గమనమునకు సంసిద్ధురాల నగుదునని !

కుమారుని శరీరము చితిపై పరుండబెట్టినారు. నలిని నూతన వస్త్రములను నూతన మాల్యములను ధరించి, కళ్యాణ తిలకము కమనీయశోభలు గ్రక్కుచుండ, ముత్తైదువులు పసుపు కుంకుమలు పై జల్లుచుండ, క్రొత్త పెండ్లికూతురువలె వచ్చి, చితికి మూడుసారులు ప్రదక్షిణము చేసి మోకరించి నమస్క రించినది. ఆమె నిర్ణిమేష నయనములు నిర్మల జ్యోతిని వెలార్చినవి. వదనమున ప్రసన్నతా భావము ప్రస్ఫుటించినది. తరువాత నామె మెల్లగా లేచి చితి నధిరోహించి కుమారుని పాదములకడ నాసీన యైనది.

రణజిత్సింహుడు చితికి అభిముఖముగా నిలుచుండి కన్నీరు కార్చుచు అంజలి ఘటించి, "ప్రభూ, వీరాగ్రేసరా ! తల్లీ, వీరపత్నీ ! ఈ సేవకున కేమి యాజ్ఞాపించి పోవుచున్నారు?" అని బాలకునివలె విలపించుచు బోరగిలబడి నమస్కరించినాడు.

చిటపటార్భటులు చెలరేగుచుండ, అగ్నిస్ఫులింగము లుత్క్రమించుచుండ లేవిహోన జిహ్వాలతో వీతి హోత్రుడు నలినీకుమారుల నాహరించినాడు.

రణజిత్సింహుడు తలయెత్తి చూచినాడు. నలినీకుమారు లిరువురు దివ్యాంబ రాలంకృతులై దివ్యకుసుమమాలా శోభి తులై దివ్యాంగనా పరివృతులై దివమున విహరించుచున్నారు.

3)

# సోహ్రాబ్ - రుస్తుమ్

౧

పారస్య దేశమునకు పూర్వదిగ్భాగమున సిస్తాన్ అను పర్వతప్రదేశము కలదు. దాని చుట్టును బహుదూరము వరకు మరుభూమి వ్యాపించియున్నది. దూరదూరమున నక్కడక్కడ నా మరుభూమిని భేదించి రెండు మూడు చిన్న నదులు ప్రవహించుచున్నవి. ఆనదులు వంకవంకలు తిరిగి ప్రవహించు ప్రదేశములందలి భూమి మాత్రము సారవంతమై సస్యక్షేత్రములతోడను వృక్షసమూహముతోడను శోభించుచుండును. అట్టి ప్రదేశములు తప్ప తక్కిన భూమియంతయు వాలుకామయమై నిష్పచ్చరమై భీషణ గంభీరాకారముతో 'హూహూహూ' అనుచున్నట్లుండును.

గ్రీష్మకాలమున నా యెడారిలో నుండి యుండి ఆతప తప్తమైన ఉష్ణానిలము రంయ్ రంయ్ మని వీచుచుండును. అట్టి సమయమున నా వేడిగాలి సోకినచో ముఖము మాడిపోవును. మధ్యాహ్నవేళలందు ఆ వాతాగ్నిస్పర్శ సహింపలేక పక్షులు ఇసుకలో ముక్కులుదూర్చి పడియుండి చనిపోయినవేమో అను భ్రాంతిని గలిగించుచుండును.

అట్టి గ్రీష్మకాలమం దొకనాడు జలప్రాంత మందలి ఏకాంత గృహమున పారస్యదేశపు ప్రధాన వీరుడగు రుస్తుం

బొమలు ముడిచికొని కూర్చుండి ఏదియో ఆలోచించుచుండెను. పారస్య రాజగు కాయకాఉస్ ఒకప్పుడు విశేషముగా సమాదరించి సమస్త రాజ్యభారమును అతని హస్తగతము చేసి తాను నిశ్చింతగా నుండెను. కాని అతనిఉపేక్షాభావము అప్రతిహతముగా నుండుటచే రాజు ముఖ వైఖరిలో నేడు ద్వేషాశంకాది చిహ్నములు ప్రకటితములైనవి. ఆకారణమున రుస్తుం హృదయము నేడు సంక్షుబ్ధమై మర్మాహతమైనది.

రుస్తుం గంభీరభావముతో కర్తవ్యమును నిశ్చయించుకొనుచు కూర్చుండి యుండెను. పార్శ్వమున సజలనయనములతో నతని భార్య తాహ్మినా నిలుచుండి యుండెను. చాల సేపటివరకు ఇరువురును నిశ్శబ్దముగా నుండిరి. ఎవ్వరి నోటను మాటలేదు. చివరకు తాహ్మినా పయటచెంగుతో కన్నీళ్ళు తుడిచికొని యిట్లన్నది : "నేను ప్రార్థించుచున్న దొక్కటియే ! ఆ యొక్కటి గూడ సఫలము చేయరా ? నా కింకేమియు నక్కరలేదు. కేవల మిది యొక్కటియే నా కోరిక—నాకు పుత్రుడు జన్మించెనేని బాల్యమున వానిని నాయుత్సంగమునకు దూరగుని చేయవద్దు. మాతృవాత్సల్యవంచితుని జేసి రణక్షేత్రమునకు గొనిపోవలదు. నాకు ఈ వరమొక్కటి మాత్రము ప్రసాదింపుడు !"

తాహ్మినా నేత్రము లశ్రుభరితములైనవి. ఆమె మొగముమీాద పయటకొంగు వేసికొని దుఃఖింపదొడగినది.

రుస్తుం చాల సేపటివరకు నేలవంక చూచుచు నిశ్శబ్దముగా నున్నాడు. తరువాత నతడు తాహ్మినాను చెంత

గూర్చుండ బెట్టుకొని యిట్లన్నాడు : "ప్రియురాలా ! నీవు నా కర్తవ్యమునకు అవరోధము కలిగించెదవా ? చిరకాలము నన్ను శృంఖలములతో వలె బంధించియుంచెదవా? పురుషులకు కర్తవ్యము అనేకములున్నవి. గృహము పత్నీపుత్రులు పరివారము మొదలైనవి వారికి సంతోషస్థానములు-విశ్రాంతి భూములు మాత్రమే. పుత్రిక జన్మించినచో పుష్పశయ్య రచించి శ్రద్ధాదరములతో పాలింపుము. పుత్రునకు మాత్రము కంటక శయ్యారచనమే నేను కోరుచున్నాను - కర్మక్షేత్రమే కాంక్షించుచున్నాను. ఎనిమిది సంవత్సరములకు మరల నేను తిరిగి వచ్చెదను. నీకు పుత్రుడు జన్మించెనేని వానిని దీసికొని మరల కర్మక్షేత్రమున కరిగెదను."

రుస్తుం ఈమాట లించుక దృఢస్వరముతో వచించినాడు. కాని అతని హృదయము పూర్తిగా అవిచలితముగా నున్నదని చెప్ప వీలులేదు. పురుషుడై యుండి - అందులో వీరుడై యుండి స్త్రీసన్నిధిలో తన హృదయ మార్దవమును వ్యక్తము చేయుటకు ఇంచుక కుంఠితుడై సిగ్గుపడినాడు. మనోభావమును మరుగుపరచ దలచినప్పుడు కపటభావమును విశేషముగా వ్యక్తము చేయుట మానవసహజము.

తాహ్మీనా లేచి నిలుచుండి అభిమానభరముతో నిట్లు పలికినది: "మీ మనః ప్రవృత్తి మిమ్ము నెటువైపు లాగికొనిపోవునో ఆవైపే మీకర్తవ్యమునకు మార్గమగును. ఇక మీరు మా గళములకు త్రాళ్ళుబిగించి మమ్ము నెటువైపు లాగికొని పోయెదరో ఆ దిక్కే మాకర్తవ్యమునకు

మార్గము కావలసియున్నది. అంతేగదా! ఆ కంఠబంధనమున ఒకవేళ మా ప్రాణములు కంఠగతము లైనప్పుడుగూడ మే మొక్కమాట మాటాడుటకైనను వీలులేదు. ఒకవేళ మాటా డినచో నది మీకర్తవ్యమునకు నిరోధకమై మీ పూరమున కభ్యంతర మగునేమి ?"

సాయంకాలమైనది. అంధకారము మెలమెల్లగా ఆవ రించుచున్నది. అట్టి సమయమున నంతఃపురరక్షకు డరుదెంచి, "ప్రభూ! ప్రయాణమున కంతయు సిద్ధమైనది. తమ అశ్వము రుక్స సుసజ్జితమై ద్వారదేశమున నిలిచియున్నది" అని చెప్పినాడు.

రుస్తుం లేచి నిలుచుండి తన బాహువునుండి స్వనా మాంకితమైన కవచము నూడదీసి, తాహ్మీనా హస్తములం దుంచి నీకు పుత్రుడు జన్మించునేని ఈ కవచము నా శిశువు దక్షిణబాహువుకు కట్టుము" అని వచించినాడు.

తరువాత నతడు బయటికి వచ్చి తన గుఱ్ఱము రుక్స నెక్కి వెడలిపోయినాడు.

౨

ఇరువది సంవత్సరముల తరువాత.

తాతారదేశము మధ్యభాగముగుండ అక్షన్‌నది మహా వేగముతో ప్రవహించుచున్నది. దాని ధవళ ప్రవాహము సూర్యకాంతిలో తళతళలాడుచు, గంభీరధ్వని చేయుచు,

ఖడ్గమువలె తీరములను కోయుచు పారుచున్నది. విదేశీయు లెవ్వరైన దూరమునుండి ఆ ప్రవాహధ్వని విన్నచో భయాశ్చర్యములతో చటుకున నిలిచి చెవియొగ్గి ధ్వని స్వభావము గ్రహించి తరువాత మెల్లమెల్లగా వెడలిపోవుచుందురు.

తరంగాయిత మగు నా నదీతీర ప్రాంతమున తాతార వాసులు పారసీకులు – ఉభయపక్షముల వారును శిబిరములు నిర్మించుకొని యుండిరి. ఆ శిబిర శ్రేణులకు నడుమ విశాల సైకతభూమి మాత్రము వ్యవధానము. రక్తవర్ణముగల శిబిరాచ్ఛాదనములు మధ్యాహ్న సూర్యకాంతిలో మిరుమిట్లు కొలుపుచుండును.

ఒక వైపున పెద్దపెద్ద శిరస్త్రాణములతో శ్రేణీబద్ధమై పారసీకుల అశ్వికసైన్యము నిలిచియున్నది. దాని వెనుక అసంఖ్యాకమగు పదాతిసైన్యము పరస్పర సంఘర్షణముతో పంక్తిబద్ధమై నిలిచియున్నది. వారిలో కొందరు ధనుర్బాణ పాణులు. కొందరు ఖడ్గహస్తులు. కొందరు భల్లకరులు. మరి కొందరు తూణీరవాహకులు.

రెండవవైపున అసంఖ్యాకులగు పారసీక సైనికులు మేషచర్మావృతమస్తకులై చిన్నచిన్న అశ్వముల నధిరోహించి యుద్ధారంభమున కెదురు చూచుచుండిరి. శిబిర బహిర్భాగమున రంగురంగుల పతాక లెగురుచున్నవి. పైన పక్షులు విచ్చలవిడిగా సంచరించుచున్నవి. సంగ్రామ మారంభ మగుట కిక ఆలస్యములేదు.

మధ్యాహ్నకాల మతిక్రమించినంతనే పటహాభేరీ ప్రభృతి రణవాద్యములు మ్రోసినవి. ఖడ్గఝుణఝుణాత్కార మారంభమైనది. అశ్వహేషారావములు మిన్ను ముట్టినవి. శృంఖలానిరుద్ధవ్యాఘ్రాదులవలె యుద్ధరంగములోనికి దూకుటకై సైనికులు ఉన్ముఖులుగా నుండిరి.

అట్టి సమయమున తురాణీసైన్య మధ్యమునుండి తరుణవీరుడగు సోరాబ్ ఉభయసైన్యములకు నడుమనున్న వాలుకాభూమిమీదికి వచ్చి నిలబడినాడు. సోరాబ్ కటియందు ఖడ్గమును, దక్షిణహస్తమున భల్లమును, వామకరమున ఫలకమును ధరించియున్నాడు. అతడొక్కసారి నాలుగు వైపులు తేరిపారజూచి యిట్లన్నాడు: సైనికులారా! యుద్ధము చేయవద్దు. పారసీక సైన్యములో నెవ్వడైన వీరు డుండెనేని, అతడు నాతో యుద్ధము చేయుటకు సమర్థుడైనచో అతనితో నేను యుద్ధము చేయుటకు సంసిద్ధుడను."

సోరాబ్ పలికిన వీరాలాపములు విని వీరవర్యుడగు రుస్తుం పారసీక సైన్యమును తోసికొనుచు తన దీర్ఘకాయమును మరింత దీర్ఘముచేసికొనుచు అతని యెదుటికివచ్చి నిలువబడినాడు. రుస్తుం ద్వంద్వయుద్ధమున కగ్రసరుడైనంతనే పారసిక సేనామధ్యమున సంతోషవాహిని ప్రవహించినది. రుస్తుంకు అభిముఖముగా సించుక దూరములో కోమల శరీరుడు తేజస్వి సోరాబ్ ఉపేక్షాభావముతో - లతికవలె ఇంచుక యొడలినడలికతో నిలిచియున్నాడు.

రుస్తుం తదేకదృష్టితో స్నేహపూర్ణ నయనములతో చాలసేపు అతనిని వీక్షించినాడు. అతని తరుణ సుందర ముఖము చూచినంతనే రుస్తుం హృదయములో వాత్సల్యము పొటకరించినది. అప్పు డతడు చేయెత్తి మెల్లమెల్లగా "వత్సా! యుద్ధమునుండి నివృత్తుడవు కమ్ము. నాకు పుత్రులు లేరు. నేటినుండి నీవు నాకు పుత్రుడవై ఆమరణాంతము నాసన్నిధి నుండుము" అని పలికినాడు.

ప్రాభాతిక మారుతస్పర్శచే పత్రములందలి శిశిరబిందువులు చలించునట్లు రుస్తుం పలికిన పలుకులకు సొరాబ్ హృదయాంతరమున పితృవాత్సల్య రూపమైన అస్పష్టభావ మించుక స్పందించినది. అత డపుడు రుస్తుం పదసమీపమున నత జానుకుడై ఆయన హస్తములు గట్టిగా పట్టుకొని ఈషత్కంపిత స్వరముతో, "మీరెవరు? నిజము చెప్పుడు. మీరు రుస్తుం అగునా కాదా?" అని యడిగినాడు.

అప్పుడు రుస్తుం ఇట్లనుకొన్నాడు: నాపేరు తెలిసినచో ఏదో మిష పెట్టి యుద్ధము చేయక, పరాజయము నంగీకరింపక, తాతార దేశమునకు తిరిగిపోయి, అందరి యెదుట సాహంకారముగా - 'నేను పారసీక వీరులను ద్వంద్వ యుద్ధమున కాహ్వానించినాను. భయముచే వా రెవ్వరును ముందుకు రాలేదు. ఒక్క రుస్తుం మాత్రము సమ్మతించినాడు. చివరకు రుస్తుంకును నాకును బంధుత్వ మేర్పడినందున యుద్ధము జరుగలేదు' అని ప్రగల్భములాడును."

ఇట్లు భావించి రుస్తుం సోరాబ్ చేతులలోనుండి తన చేతులు లాగికొని, దూరముగా నిలుచుండి, అతని ముఖము మీద తీవ్రదృష్టి పరపి, రూక్ష స్వరముతో నిట్లు వచించెను: "నేను రుస్తుం అగుదునో కానో తెలిసికొన్నందున నీ కేమి లాభము ? నీవు కేవలము రుస్తుంతోడనే యుద్ధము చేయ గోరుచున్నావా ? రుస్తుం ఇక్కడ నున్నచో నీవు యుద్ధము చేయుటయే పొసగదు. ఆయన ముఖము చూచినంతనే నీవు పారిపోయి యుందువు. ఉద్ధత బాలకా ! నీవు రుస్తుంతోడ యుద్ధము చేయుటకే తలకొంటివా ? నీకంత స్పర్ధయా ?"

రుస్తుం పలుకులకు కోపము వచ్చి సోరాబ్ సర్వాంగ ములు కంపించినవి. అతడు లేచి నిలుచుండి రుద్ధస్వరముతో, "అట్లయిన రండు, యుద్ధము చేయుడు" అని గర్జించినాడు.

రుస్తుం సమాధానము చెప్పలేదు. అతడు తన బల్లె మెత్తి గురిచూచి విద్యుద్వేగముతో సోరాబ్ మీద విసరెను. సోరాబ్ త్రస్తమృగమువలె వెనుకకు దూకి ఇంచుక జరిగి నిలిచినాడు. భల్ల మతని శరీరమునకు తాకక పోగా హిస్ హిస్ శబ్దముతో వచ్చి యిసుకలో గ్రుచ్చుకొన్నది. సోరాబ్ తన బల్లెమును విసరినాడు. అది రుస్తుం ఫలకముమీద ఝణాత్కారము చేసి మొక్కవోయి క్రిందబడినది.

నిష్ఫల ప్రయాసుడై రుస్తుం క్రోధముతో సోరాబును లక్ష్యముచేసి సత్తువకొలది తన భీషణగదను విసరెను. సోరాబ్ పూర్వమువలె రెప్పపాటులో నావలకు జరిగి నిలిచినాడు. గద

సైకతములో దిగబడిపోయినది. అంతేకాక గదా ప్రహార వేగ మున కాగలేక రుస్తుం భోరగిలబడినాడు. ఉద్దేశ మున్నచో సోరాబ్ అప్పుడాయన శిరము నరుకవచ్చును. కాని అత డట్లు చేయలేదు. పై పెచ్చు రుస్తుంను సమీపించి ఆయన బుజము పట్టుకొని లేవనెత్తుచు, "లెండు, నామీద కినుక వహింపకుడు. మిమ్ము చూచినప్పటినుండి ఏలనో మీ మీద నాకు రాగ ద్వేషములు కలుగుట లేదు. మీ దర్శన మెందుకో నా హృద యమును వికలము చేసివేసినది, నేను బాలకుడను. నిజమే. కాని నేను గూడ చాల యుద్ధములను చూచినాను. భిన్న బాహువులను, భిన్న పాదులను, విద్ధహృదయులను అనేకు లను చూచినాను. వారి ఆక్రందనములెన్నో ఆకర్ణించినాను. అట్టి సమయములందుగూడ నా పాషాణహృదయ మీ విధ ముగా విచలితము కాలేదు. సత్యము చెప్పుడు, మీరు రుస్తుం అగునా కాదా ?" అని కోరినాడు.

సోరాబ్ తన మాటలు పూర్తి చేయక పూర్వమే రుస్తుం లేచి, దుమ్ము దులుపుకొని, ధూళిమలినమైన తన బల్లె మును తెచ్చికొన్నాడు. అతని నేత్రములు ప్రదీప్తాంగారముల వలె ప్రజ్వలించినవి. పండ్లు కొరుకుచు, "బాలకా! సాదర సంభాషణముతో నన్ను మోసగించ దలచితివా ?" అని గర్జిం చుచు అతడు బల్లెము నెత్తి పట్టుకొన్నాడు.

సోరాబు కోశమునుండి ఖడ్గము బయటికిలాగి ఎత్తి పట్టుకొన్నాడు. సూర్యకాంతిలో నాఖడ్గము విద్యుత్స్ఫులింగకలు విసరినది. తరువాత నిరువురు నొండొరులపై ఆఘాత ప్రతా

ఘాతములు వర్షించినారు. రుస్తుం భల్లము సోరాబు ఫలకమునకు తగిలినది. డాలు ఇంచుకంత భిన్నమైనది. రుస్తుం శిరస్త్రాణముమీద సోరాబ్ ఖడ్గముతో కొట్టినాడు. శిరస్త్రాణము తటాలున ఊడి క్రిందబడిపోయినది. వదన భీషణత్వమునకు కోమల సాత్వికత నాపాదించు రుస్తుం పలితకేశములు ప్రకటితములైనవి. అతడు లజ్జచే శిరము వంచికొన్నాడు. అతనికి ఆపద సమీపించినదని తెలిసికొని రుక్స్ వికటముగా హ్రేషించినది. ఆభీషణ హ్రేషకు నదీజలము కంపించినది. అట్టి సమయమున సోరాబు రుస్తుంను సులభముగా చంపవచ్చును. కాని అతడట్లు చేయలేదు.

అంబుదములాదిత్యు నాచ్ఛాదించినవి. నదీజలములపై మలినచ్ఛాయలలముకొన్నవి. యుద్ధము మాత్రము సమాప్తి నొందలేదు.

రుస్తుం చాలసేపటివరకు ఏమియు మాటాడక మనసులోనే ఏదియో ఆలోచించుకొనసాగినాడు. పిదప తన శక్తి నంతయు కూడదీసికొని అతడు 'రుస్తుం' అని మేఘ గంభీర ధ్వనితో గర్జించినాడు.

రుస్తుం పేరు విన్నంతనే సోరాబ్ అతని ముఖమువంక తదేక దృష్టితో చూచుచు శిలావిగ్రహమువలె నిలబడిపోయినాడు. అతని హస్తములనుండి ఖడ్గఫలకములు జారిపడిపోయినవి. అదే సమయ మనుకొని రుస్తుం తన శాణితాస్త్రమును అతని వక్షమున గ్రుచ్చినాడు. వక్షమున గ్రుచ్చుకొన్న

మును వామహస్తముతో పట్టుకొని సోరాబ్ ఇసుకపై పడి పోయినాడు.

సోరాబ్ పడిపోవుట చూచి ఉపేక్షాభావము తో రుస్తుం, "నీవు నీ దోషముచేతనే ప్రాణములు పోగొట్టుకొన్నావు" అన్నాడు.

సోరాబ్ ధృఢచిత్తముతో నిర్భీకస్వరముతో ఇట్లు ప్రత్యుత్తరము చెప్పినాడు: "వృథాహంకారము వలదు. మీరు కాదు నన్ను కొట్టినది. రుస్తుం నన్ను పడగొట్టినాడు. మీవంటి వీరుల నిరువదిమందిని నేనొక్కడనే భూమిశాయులను చేయ జాలుదును. కాని మీ ముఖనిస్సృత మగు రుస్తుం నామము నాబలవీర్యములను క్రుంగజేసినది. నా నిస్సబసితిని గ్రహించి అదే తరుణ మనుకొని మీరు దొంగవలె వచ్చి కొట్టినారు. రెండుమూడు పర్యాయములు నా కట్టి తరుణములు లభించి నను మీ యందలి పితృభావముచేతను, అధర్మయుద్ధమునకు మనస్సు ఒగ్గమిచేతను నేను మిమ్ము కొట్టలేను. అట్లుకాకున్న జాము క్రిందట మీ శరీరము నేల పాలై యుండును. దీనికి ప్రతిఫలము నతి శీఘ్రకాలములో అనుభవించెదరులెండు. తన కుమారుడు మరణించినాడన్నవార్త విన్నంతనే రుస్తుం క్రోధా నల దందహ్యమాన హృదయుడై పుత్రఘాతకునకు తగిన శాస్తి చేసి తీరును."

రుస్తుం తన కుమారుడు పాద సమీపమున పడి యున్నను గ్రహింపలేకపోగా, సోరాబ్ పలుకులందుగూడ

విశ్వాసము కలుగక, మూఢుడా! ఎందుకు వ్యర్థప్రలాపములు పలికెదవు ? రుస్తుంకు పుత్రుడు కలుగలేదు. అతనికి కేవల మొక్క పుత్రికయే ఉన్నది" అని బదులు పలికినాడు.

సోరాబ్‌కు క్రమముగా వాక్శక్తి క్షీణించుచున్నది. తీవ్రవేదనచే శరీరమాపాదమస్తకము కంపించుచున్నది. అయినను అతడు అసమాన సహనశక్తితో మెల్లమెల్లగా నిట్లు పలికినాడు: "నేను అసత్యము పలుకుటలేదు. రుస్తుంకు పుత్రుడున్నాడు. ఆపుత్రుడు నేనే! ఈయిరువది సంవత్సరములలోపల నేనెన్నడును పితృముఖము చూడలేదు. నాతండ్రి విషయము నాతల్లి నడిగినప్పుడెల్ల ఆమె మౌనము వహించుచుండెడిది. చివర చివరకు తండ్రి విషయము తెలిసికొనకుండ నుండలేక పితృన్వేషణార్థము బయలుదేరినాను. తాతారుల పక్షము వహించి పారసీకవీరులను ద్వంద్వయుద్ధమున కాహ్వానించినచో రుస్తుం తప్పకబయట పడు నని ఆశించితిని. కాని నా ఆశ సఫలము కాలేదు. తన ఏకపుత్రుడు మరణించినాడని తెలిసినంతనే రుస్తుం హృదయ మెంతగా సంక్షోభించునో ఆలోచింపుడు! పితృవిచారవిషయమై నే నంతగా విచారించను. నాజనని నన్ను చూడకున్న నెట్లు జీవించునో! నేను సెలవు తీసికొని వచ్చునపుడు నాతల్లి అశ్రుపూర్ణనయనములతో, నాయనా! శీఘ్రముగా యుద్ధమునుండి తిరిగిరమ్ము. ఆలసించవలదు. అని ఎన్నోసారులు చెప్పినది. నే నామె నెట్లో ఓదార్చి వచ్చితిని. కాని నా తల్లి నింక నేను చూడను గదా!"

ఇట్లనుచు సోరాబ్ పిల్లవానివలె నేడువ నారంభించినాడు.

అప్పటికిని రుస్తుంకు సోరాబ్ తన కుమారుడే అను విశ్వాసము కలుగలేదు. పుత్రుడు జన్మించినాడని తెలిపినచో శైశవమునందే వానిని తనవద్దనుండి రుస్తుం తీసికొనిపోవునను భయముచే తాహ్మినా పుత్రిక పుట్టినదని అయనకు మిథ్యా వార్త పంపినది. అప్పటినుండి రుస్తుం తనకు కన్యక కలిగినది గాని కుమారుడు కలుగలేదను విశ్వాసముతో నున్నాడు. ఇప్పుడు సోరాబ్ పలుకులు వినినపిదప, యౌవన సమయమందలి విషయ పరంపర విస్మృతి యవనికాభ్యంతరమునుండి మనోరంగమున నొక్కొక్కటి ప్రత్యక్షమై రుస్తుం కన్నీరు నించినాడు.

తరువాత రుస్తుం గద్గదికస్వరముతో, "నీవంటి పుత్రుడు జన్మించియుండిన రుస్తుం ఆనందమునకు పారముండెడిదికాదు. నీవు అసత్యమాడుచున్నావు. రుస్తుంకు పుత్రుడు కలుగ లేదు" అని వచించినాడు.

సోరాబ్ ఒక చేతిమీద శరీరభారమంతయు మోపుకొని, ఇంచుక లేచి క్రుద్ధస్వరముతో నిట్లు పలికినాడు: "నా మాటలమీద విశ్వాసము కలుగుటలేదా, పాషాణ హృదయుడా! బ్రతికియుండినంతకాలము అసత్యమునకు దూరముగా నున్నాను. చావబోవుచు అసత్యమాడుదునా? నేను రుస్తుం పుత్రుడ నగుదునో కాదో తార్కాణము కావలెనా? రుస్తుం ఈ కవచమును మాతల్లికిచ్చి పుత్రుడు కలిగినచో వాని దక్షిణ హస్తమునకు కట్టుము అని చెప్పినాడు."

ఇట్లు పలుకుచు సోరాబ్ తన దక్షిణ బాహువునకు కట్టియున్న రుస్తుం నామాంకిత కవచమును చూపించినాడు.

కవచమును చూచినంతనే రుస్తుం శరీరము ఆపాదమస్తకము కంపించినది. నయనములం దంధకార మలముకొన్నది. చివరకతడు ఊర్ధ్వకంఠమున, "నాయనా! నీవు అసత్యమాడ లేదు. నేనే రుస్తుమును - నీతండ్రిని. తండ్రిచేతులలోనే నీవు ప్రాణములు కోలుపోయినావు." అని యేడ్చుచు కోశమునుండి కరవాలమును బయటికిదీసి తనవక్షమున గ్రుచ్చుకొనబోయెను.

సోరాబ్ అత్యంత కష్టముతో జరిగి రుస్తుం హస్తమును పట్టుకొని, "తండ్రీ! నేను నాదోషమువల్లనే నాప్రాణములు కోలుపోయినాను. ఇందులో మీ దోషమెంతమాత్రమును లేదు. ఏల అనవసరముగా దుఃఖించెదరు?" అని పలుకుచు అతని చేతిలోని ఖడ్గమును దీసికొన ప్రయత్నించినాడు.

రుస్తుం ఖడ్గమును విరిచి ఆవల పారవైచి కుమారుని హృదయమునకు హత్తుకొని, అతని నుదురు మాటిమాటికిని ముద్దాడినాడు. ఆ సమయమున రుక్స్ సమీపించి సోరాబ్ ముఖముమీాద మూతిపెట్టి సవిచార దృష్టితో చూచినది.

రుస్తుం రుక్స్‌ను చూచి, "రుక్స్! ఇప్పుడు నీవు దుఃఖపడుచున్నావా? నీవేకదా నన్ను మోసికొనివచ్చి సమరాంగణమున దింపినది!" అని విలపించినాడు.

రుక్స్ పేరు విని సోరాబ్ దానివంక తిరిగి, "ఇదేనా రుక్స్! మాతల్లి దీని విషయము చెప్పగా విన్నాను" అని పలుకుచు రుక్స్ ముఖమును మెల్లగా నిమిరినాడు.

తరువాత కొంతసేపటికి సోరాబ్ మరల నిట్లు పలికి నాడు: "తండ్రీ! నా మృతదేహమును సిస్తానుకు తీసికొని పోయి, అక్కడ గోరి కట్టించి, గోరి రాతిమీద 'వీరరుస్తుం వీరపుత్రుడు సోరాబ్ ఇందు శయనించియున్నాడు' తెలియక తండ్రి కుమారుని వధించినాడు అని చెక్కింపుడు."

ఇట్లు పలుకుచు సోరాబ్ తన వక్షమునుండి ఖడ్గమును పెరకివైచినాడు. రక్తము చిమ్మనగ్రోవినుండివలె స్రవించినది. సోరాబ్ చైతన్యహీనుడై రుస్తుం ఒడిలో పడిపోయినాడు. ఇక కదలలేదు.

క్రమముగా సాయంకాలమైనది. చీకటులు వ్యాపించినవి. శిబిరములందు ఒకటొకటిగా దీపములు వెలిగినవి. రుస్తుం ఒకడే అక్షస్‌నదీతీర సైకతములో సోరాబ్ మృతదేహమును ఒడి యందుంచికొని శూన్యదృష్టితో శూన్యమువంక చూచుచున్నాడు.

---

# * పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్

ఆ కాలములో పక్షధరమిశ్రునివంటి మహాపండితుడు భారతవర్షమున నింకెవరును లేరని చెప్పవచ్చును. ఆయన నామముతో మిథిలానగరము గౌరవాన్వితమైనది. ఆయనమీద మహారాజు బహుమానములు సహస్రధారలుగా వర్షించుచుండును. ఆయన ముఖమండలము దేశదేశవ్యాప్తమైన ప్రఖ్యాతిచే ప్రకాశించుచుండును.

నానాదేశములనుండి దిగ్విజయార్థము పండితులు పక్షధరమిశ్రునితో శాస్త్రార్థము చేయవచ్చుచుండిరి. పక్షధరుడు రాజసభలో ఉచ్చపీఠమున నుపవిష్టుడై యుండును. అతని పీఠమునకు క్రిందుగా సోపానపంక్తి యున్నది. సోపానముమీద ఆసనములు సిద్ధపరచి యుండును. పక్షధరుని శిష్యులు వారి వారి విద్యాప్రావీణ్య తారతమ్యమును బట్టి వానిపై నాసీనులగుచుందురు.

శాస్త్రార్థము చేయదలచినవారు ప్రప్రథమమున చివర మెట్టుమీద శిష్యునితో, శాస్త్రచర్చ ప్రారంభింపవలెను. ఆ శిష్యుడోడిపోయినచో వానికన్న పైమెట్టుమీద కూర్చుండిన వానితోడను, అతడుగూడ పరాజితుడైనచో వానికన్న

---

* 'సర్వత్ర జయమన్విచ్ఛేత్ పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్' అని నీతివాక్యము. అన్నిచోట్లను తనకు జయము కోరుకొనవలెను. తన పుత్రునివల్ల పరాజయమును కోరుకొనవలెను. అనగా తనకన్న కుమారుడు గొప్పవాడు కావలెను అని అభిప్రాయము.

పై సోపానముమీద వానితోడను శాస్త్రమీమాంస సలుప వలెను. ఈవిధముగా నారోహణ క్రమమున నెవ్వడైన శిష్యుల నందరను జయించు భాగ్యము నొందునేని అట్టి అదృష్టవంతు నకు పక్షధరమిశ్రునితో శాస్త్రవాదము చేయు నవకాశము లభించును.

పర్వత ప్రమాణమైన పాండిత్యాభిమానముతో మిథిలానగరమున కేతెంచిన పండిత ప్రకాండులలో కొలది మంది మాత్రమే పక్షధరుని పాదసమీపమున నున్న-ఊర్ధ్వ సోపానముమీద శిష్యునితో వాగ్వాదము చేయగలిగినారు. కాని మిశ్రునితో తర్కవితర్కములు సలిపి ఆయన కంఠమం దలి జయమాల్యమును సంగ్రహించిన పండితాగ్రణి ఒక్కడు లేడు.

విదేశపండితు లరుదెంచి తన శిష్యులతో శాస్త్ర వాదము సలిపి పరాజితులైనప్పుడు పక్షధరుని వదనము ఆనం దోద్భాసిత మగుచుండును. కాని తదితర సమయములందు శిష్యులవంక చూచి నపుడెల్ల ఆయన హృదయము హాహా కారము చేయుచుండును. నిరాశావ్యథ ఆయన మనస్సును జర్జరితము చేయుచుండును.

ఒకనా డాయన విచారముతో దీర్ఘనిశ్వాసము విడిచి మహారాజుతో, "నాకు తగిన శిష్యుడొక్కడును ఇంతవరకు లభించలేదు. నాజీవితమంతయు వినియోగించి పడిన విద్యా శ్రమము వ్యర్థమగుచున్నది" అని పలికినాడు.

అప్పుడు మహారాజు ఇట్లు వచించినాడు: "అదేమి మాట, పండితశిరోమణీ! తమ శిష్యులలో నొక్కొక్కడీభువన మంతయు జయింప సమర్థుడైనాడు. పండితు లనేకులు దిగ్విజయాభిలాషతో వచ్చి వారివల్ల పరాజితులై పోవు చుండిరిగదా!"

అందుకు పక్షధరు డిట్లన్నాడు: "తాము సెలవిచ్చినది నిజమే. కాని వారి సామర్థ్యము నాపాద పీఠతలమున కూర్చుండి యుండునంతవరకే! నావద్దనుండి వెడలిపోయిన తరువాత వారి సామర్థ్యము ప్రకాశింపదు. వారు నాకు కేవల శిష్యులు. ఆజన్మాంతము శిష్యులుగానే యుందురు. నాకడ ఎంత నేర్చినారో వారి విద్య అంతవరకే. అంతకన్న ఎప్పుడును విశేష ముగా శోభించదు."

మహారాజు మందహాసముతో ఇట్లు వచించినాడు: "పండితాగ్రణి! ఆకాశమున సూర్యుడొక్కడే ఉన్నాడు. సూర్యునివల్లనే ప్రపంచమంతయు ప్రకాశించుచున్నది. అట్లే ఈ శరచ్చంద్రుడున్నాడు. చంద్రుడుగూడ సూర్యకిరణములను గ్రహించి జగత్తును ప్రకాశింపజేయుటలేదా?"

పక్షధరు డిట్లు గంభీరముగా పలికినాడు: "నా విశ్వాసము చెప్పుమందురా! ఈ చంద్రుని ముఖము చూచి చూచి సూర్యుని ప్రాణములు కుంచుకొనిపోవుచున్నవి. అంతకన్న దీపమెంతో నయము! అది స్వప్రకాశముతో ప్రకాశించు చున్నది. దీపమును జూచియున్న సూర్యుడు చాల తృప్తిపడి యుండును. సూర్యుడు యుగయుగాంతరములనుండి చంద్రుని

మీద ఆలోకవర్షము కురిపించుచున్నాడు. ఎందుకు అని అడు గుడు. సూర్యునకొక ప్రత్యాశ ఉన్నది. ఒకనాడు కాకున్న ఇంకొకనాడైనను చంద్రుని వదనమునుండి వినిర్గత మగుచున్న ప్రకాశ ప్రపాతమును ప్రక్కకు నెట్టుచు హృదయమును భేదించి తదంతర్గతమగు స్వప్రకాశము ఆకస్మికముగా విద్యు త్పరంపరవలె బహిర్గతమగునేమో చూచి ఆనందింపవలెనని. అదే ఆయన ప్రత్యాశ. నాకును అట్టి ప్రత్యాసయే కలదు. శిష్యులపైన శిష్యులు వచ్చుచున్నారు. ఎంతో శ్రమకోర్చి నా హృదయమందలి విద్యను వారి హృదయములలో ప్రవేశ పెట్టుచున్నాను. ప్రవేశపెట్టి వారి ముఖములవంక చూచుచు నిరీక్షించుచున్నాను - వారి వదనములనుండి స్వీయ విద్యా కిరణము – స్వకీయ ప్రతిభాజ్యోతి ప్రకటితమగునేమో నని! మహారాజా! ఇన్నిసంవత్సరములనుండి ఇంతమంది శిష్యులు సమకూడినారు. కాని నేను అభిలషించుచున్న శిష్యుడు మాత్రము నాకు లభించలేదు."

ఆనాడు పక్షధరునిమనస్సు చాల కలవరముగానున్నది. నవద్వీపమునుండి మహాపండితు డొకడు శాస్త్రవాదము నిమి త్తము రాజసభకు వచ్చినాడు. శాస్త్రచర్చచేసి క్రింది మెట్ల మీది శిష్యుల నోడించి చివరకు పక్షధర సమీపవర్తియగు శిష్యునిచే పరాజితుడైనాడు. శిష్యుడు జయమాల్యము నొందినాడు. అందుకు సంతోషించుటకు బదులుగా పక్షధరుడు జేతయగు శిష్యునిపై ఉగ్రభావముతో కోపగించినాడు. శిష్యుల నందరను ఎన్నడు లేని కోపముతో తిరస్కరించినాడు.

అపుడు మహారాజు ఇట్లన్నాడు: "పండితవర్యా! తమ శిష్యుడు పొందిన జయగౌరవము తమదేగదా! తమ కెందుల కింత యసంతృప్తి? ఏల ఇంత చికాకు?"

పక్షధరుడు: "మహారాజా! ఈ జయము గణనీయము కాదు. పండితంమన్యుని తోడి జయపరాజయము లశ్రద్ధేయములు. అది అట్లుంచి నేడు మా శిష్యులు శాస్త్ర మీమాంసలో ప్రదర్శించిన అజ్ఞతయు అపటుత్వమును నా హృదయమును భగ్నము చేసినవి. విపక్షుడు పరాజితుడైనాడనిన నతడు వీరికన్న మూర్ఖుడగుట వల్లనే సుమా!"

క్రోధముతోడను మనస్సంక్షోభముతోడను నాడు పక్షధరుడు రాజసభనుండి గృహమున కరిగినాడు. గృహ ద్వారము సమీపించినంతనే సుదర్శనుడు నగ్నశిరస్కుడు నగు యువకు డొకడు కనిపించినాడు.

పక్షధరుని చూచినంతనే యువకుడు లేచి నిలుచుండి, నడుము కట్టుకొని, ప్రాంజలియై, సులలిత కంఠముతో అనవద్యోచ్చారణముతో స్వరచితమైన శార్దూల విక్రీడిత వృత్తముతో నమోవాక పద్యము పఠించి ఆయన పాదముల కభివాదనము చేసినాడు. పద్యద్వారమున యువకుడు తాను నవద్వీపవాసిననియు, రఘునాథ శర్మాహ్వయుడననియు, విశ్వవిశ్రుత కీర్తియగు పక్షధర మిశ్రశ్రీ చరణ సమీపమున విద్యాశిక్షకై వచ్చితిననియు ఆత్మనివేదనము చేసికొన్నాడు.

పక్షధర మిశ్రుడు యువకుని వదనమువంక తేరిపార చూచి విస్మితుడై పులకాంకురిత శరీరముతో ఆశీర్వదించి,

"వత్సా! ఈశ్లోకము నీవు రచించినదేనా?" అని ప్రశ్నించి నాడు.

యువకు డాయన ప్రశ్నకు సమాధానముగా మందాక్రాంత వృత్తముతో ఆశువుగా నింకొక శ్లోకము చెప్పినాడు.

పరమానందముతో పక్షధరుడు యువకుని ఆలింగనము చేసికొన్నాడు.

*

కొంతకాలము గడచిన తరువాత ఒకనాడు మహారాజు ఇట్లన్నాడు: "పండిత సార్వభౌమా! కొన్నిదినములనుండి తమ వదనము ప్రమోదాతిశయముతో ప్రఫుల్లముగా నుండుట చాల సంతోషముగా నున్నది."

పక్షధరుడు:— (నవ్వుచు) సకల విషయములకు వలెనే దానికిని కారణ మున్నది.

మహారాజు:— మేము తెలిసికొనవచ్చునా?

పక్షధరుడు:— అవశ్యము. ఇంతకాలమునుండి నా జీవితము సార్థకమగునా అని విచారించుచుంటిని. ఇప్పుడు నాకు యోగ్యుడైన శిష్యుడు లభించినాడు. అదే నా సంతోషమునకు కారణము!

మహారాజు:— యోగ్యుడైన శిష్యుడు లభించుట నిజముగా సంతోషింపదగిన విషయము. తమ సంతోషము మాకును సంతోషదాయకమే. కాని యోగ్య శిష్యుడు లభింపకున్న తమ జీవితము నిరర్థక మెట్లగునో తెలియ లేదు.

పక్షధరుడు:—(ఉచ్ఛ్వసిత కంఠముతో) మహారాజా! యోగ్యశిష్యలాభ మెంత ప్రమోదావహమో తమ రూహించి నట్లులేదు. ఇంతవరకును నేను నా ప్రజ్ఞాలోహ ఖండముతో శిష్యబుద్ధులమీద కొట్టుచున్నాను. వారిబుద్ధులు మట్టిపెళ్లలు. అందుచేత నాలోహఖండాఘాతము వారి బుద్ధులమీదబడి చప్పబడిపోవుచున్నది. కాని ఈ నా శిష్యునిబుద్ధి అట్టిదికాదు. అది అయస్కాంతమువంటిది. లోహ ఖండాఘాతము తగిలి నంతనే ఆ సూదంటి రాతినుండి ప్రజ్ఞాస్ఫులింగములు ప్రాదుర్భ వించును. అతని మనీషి నేను చెప్పినదానిని గ్రహించి యూర కుండదు. ఘాతమునకు ప్రతిఘాత మిచ్చును. అట్టి శిష్యుని పొందలేకున్న ఆచార్యుని జీవితము వ్యర్థము.

మహారాజు:— తమ ముఖమునుండి యిట్టి ప్రశంశకు పాత్రుడైన ఆ శిష్యుడు నిజముగా ధన్యుడు! అతని జన్మము ధన్యమైనది. మా కా శిష్యుని దర్శనము చేయించ గోరు చున్నాను.

పక్షధరుడు:— చిత్తము, మహారాజా! రేపటి రాజ సభలో నతనిని వాదస్థానమున గూర్చుండబెట్టెదను.

*

మరునాడు రాజసభకు వారణాసినుండి విఖ్యాత పండితు డొకడు దిగ్విజయార్థము వచ్చినాడు. పక్షధరుడు యథారీతి ఉచ్చపీఠము నధిష్ఠించినాడు. శిష్యులు వారివారి సోపానములం దాసీనులైనారు. అన్నిటికన్న క్రింది సోపానముమీద నూతన శిష్యుడగు రఘునాథు డాసీనుడైనాడు.

నాటి వాదవిషయము శబ్దము నిత్యమా అనిత్యమా అనునది. సంస్కృతదర్శనములందు ప్రవేశమున్నవారికి భారతీయ దర్శనములలో అది గురుతరసమస్య అని తెలిసినదే. అసంఖ్యాకులగు మహామహోపాధ్యాయులైన పండిత ప్రకాండులు చర్చించి తలలు బ్రద్దలు కొట్టుకొన్న విషయమది !

వారాణసీపండితుడు శబ్దము అనిత్యమని పూర్వపక్షముపపాదించినాడు. తన పక్షసమర్థనమునకై యుక్తిప్రయుక్తులు శ్రుతిప్రమాణములు శాస్త్రదృష్టాంతములు చిత్తజల్లుగా వర్షించినాడు.

అతని వక్తృవ్యాంశ ప్రదర్శన క్రమమును, వాక్యరచనా పటుత్వమును పాండిత్యప్రాగల్భ్యమును, యుక్తి చాతుర్యమును చూచి సభస్తారు లతని వాదమునకు సమాధానము లేదని నిశ్చయించుకొన్నారు.

శిష్యగణము నడుమ చాంచల్యము బయలుదేరినది. వారిదివరకు ఏతద్విషయములో నేయే యుక్తి ప్రయుక్తులు ఖండన మండనములు అభ్యసించి యుండిరో వాని నన్నిటిని ఉద్ఘాటించి ఆమూలాగ్రము ఖండించి కాశీపండితుడు తన పూర్వపక్షము నెంతో నిపుణముగా ప్రఖ్యాపనము చేసినాడు. అతని నూతన సిద్ధాంతములను ప్రత్యాఖ్యానము చేసి ప్రతి సమాధానము చెప్పుట యెట్లు అని పరిపరి విధముల పక్షధర శిష్యులు భావించినారు. పూర్వపక్షమునకు సదుత్తరములు చెప్పలేకున్న రాజసభలో అవమానము కలుగుటయే కాక

తమ ఆచార్యుని తిరస్కారమునకు పాల్పడవలసి వచ్చు నను భయముచే వారి హృదయములు సంకుచితములైనవి.

పూర్వపక్షము పరిసమాప్త మైనంతనే సభాసదు లంద రుత్కంఠిత చిత్తముతో ప్రత్యుత్తరము కోసము ప్రతీక్షింప నారంభించిరి.

పక్షధరమిశ్రుని ఉచ్చపీఠ మందలి అంత్య సోపానము మీద నిశ్చలముగా గూర్చుండి రఘునాధుడు ధీరస్నిగ్ధ కంఠ ముతో పూర్వపక్ష ఖండనమును ప్రారంభించి నంతనే అతని మూర్తిని, కంఠస్వరమును, వాగ్ధారిని పరికించి సభాస్తారులు పులకిత శరీరులైనారు. కాని పండిత ప్రకాండుని అసామాన్య యుక్తి పరంపరను ఆ చిన్నిపటువు ప్రత్యాఖ్యానము చేయ గలడని విశ్వసించలేకపోయినారు. రఘునాధుడు పూర్వ పక్షాంశముల నొక్కొక్కటి ఉగ్గడించి, విమర్శించి, సూత్ర ములు నిశితములు నగు తర్కన్యాయములతో క్రమక్రమ ముగా భిన్నభిన్నము చేయసాగినాడు. అపుడు సభాసదు లవా క్కులై ఆశ్చర్యాపహృతులైనారు. పక్షధరుని ముఖమండ లము ప్రమోదముచే నుద్భాసితమైనది. అతడు ఆనందోచ్ఛ్వ సితములైన నిర్నిమేషదృష్టితో శిష్యునివంక వీక్షింపదొడగి నాడు.

సులలిత కంఠముతో, అవిరలధారతో, వాగ్మియగు రఘునాధుని వదనమునుండి వాక్యలహరి ప్రవహించుచుండి నంతవరకు సభయంతయు సూది రాలిన చప్పుడగు నంత నిస్తబ్ధమైనది. సకలకంఠములును స్తంభితములైనవి. సకల

చక్షువులును, సకలకర్ణములును రఘునాథుని ముఖము మీదనే వ్రాలినవి. రఘునాథుడు ఖండనము పూర్తిచేసి విరమించి నంతనే శతశతకంఠము లొక్కసారి 'సాధుసాధు' అని ధ్వనించి నవి. ఆ ధ్వనితో సభాభవన మొక్కపెట్టున ప్రతిధ్వనించినది. పక్షధరుడు గబగబ పీఠము దిగివచ్చి తన కంఠమందలి పుష్ప మాల రఘునాథుని కంఠమం దుంచి కౌగలించుకొన్నాడు. రఘునాథుడు వినయ వినమితమస్తకుడై ఆచార్య బహూ కృతిని గ్రహించి ఆయన పాదములకు నమస్కరించినాడు.

ఇక ప్రతివాది రఘునాథుని ఖండనమునకు ప్రత్యుత్తర మీయవలెను. ఒకానొక చిన్ని బాలకునివల్ల తాను ఎంతో ఆలోచించి, ఎంతో పొందికగా, ఎంతో నిపుణముగా సమ కూర్చుకొనిన యుక్తిజాలమంతయు భిన్నభిన్నమైనంతనే అతని కడుపు మండిపోయినది. అతనికి పట్టరాని కోపము వచ్చినది. అత డిక శాంతముగా నాలోచింపలేక పోయినాడు. ప్రతియుక్తి యొక్కటియు స్ఫురింపలేదు. క్రోధావమానములతో నతని శరీర మాపాదమస్తకము కంపింప దొడగినది. మస్తకము ఘూర్ణిల్ల సాగినది.

అప్పు డతడు సభ్యతావిరుద్ధములైన వ్యంగ్య పరిహాస ములకును దూషణములకును దిగినాడు. కలికాలపు బాలకుడు, పరాన్నపుష్టుడు, పరోపజీవి, భిక్షుకుడు మొదలైన మాట లతో నతడు రఘునాథుని తిట్టినాడు.

రఘునాథుడు మనసులో బాధపడుచున్నను, భయ విచారములతో ఆత్మగోపనము చేసికొని మౌనము వహించి

నాడు. తరువాత ప్రతివాది పక్షధరుని వ్యంగ్యభాషణములు పలికినాడు. పిదప సభాస్తారులను దూషించినాడు.

రాజు ప్రతివాది దౌర్జన్యమును వారించి రఘునాథుని జయమాల్యాలంకృతుని చేసినాడు.

*

నాడు పక్షధరమిశ్రుని ఆనందమునకు మేర లేదు. అతడు రఘునాథుని చాలసేపు కౌగలించుకొని ఆనందాశ్రువులతో నభిషేకించి ఆశీర్వదించినాడు.

అప్పుడు మహారా జిట్లన్నాడు: "పండితోత్తమా! తాము యథార్థము పలికినారు. తమ శిష్యుడు తమ గౌరవమును కాపాడగల సమర్థుడు."

పక్షధరుడు ఆనందోచ్ఛ్వసిత కంఠముతో, "కేవలము కాపాడుటయే కాదు, మహారాజా! నాగౌరవము నితడు విస్మృతి వీధిలోనికి విసరివేయ గలడు" అని వచించినాడు.

అప్పుడు రఘునాథుడు వినయభావముతో, "గురూత్తమా! తమరు నాయందలి వాత్సల్యముచే నట్టి అతిశయోక్తులనుచున్నారు. కాని నా కంతటి స్పర్ధ లేదు" అని విన్నవించినాడు.

పక్షధరుడు కపటరోషముతో, బాలకా! నీ కట్టి ఉన్నతాశయము లేకుండినచో అర్ధచంద్ర ప్రయోగముచే నిన్నెప్పుడో బయటికి గెంటి వేయుదును. తెలియదా, మూఢుడా! 'సర్వత్ర జయ మన్విచ్ఛేత్ పుత్రాదిచ్ఛేత్పరాజయమ్' అని అభియుక్తులు పలికిన పలుకులు! వంశములు రెండు. ఒకటి

జనక వంశము, విద్యావంశము రెండవది. కనుక శిష్యుడు గూడ పుత్రుడే. అందుచేత 'శిష్యాదిచ్ఛేత్ పరాజయమ్' అని నే ననుచున్నాను. నీ వల్ల పరాజయమే నా కామ్యము" అని పలికినాడు.

ఆచార్యుని వాత్సల్యమునకు రఘునాథుడు పరవశుడైనాడు. అతనినయనములనుండి ఆనందాశ్రువులు జాలువారినవి. కంఠము రుద్ధమైనది. అత డాచార్యుని పాదములమీద వ్రాలి పాదధూళి కనుల కద్దుకొని సంతోషోద్భాసిత ముఖముతో, "తమ ఆశీర్వాదము శిరోధార్యము" అని విజ్ఞాపించినాడు.

*

రఘునాథుని భవిష్యత్తును స్వప్నముకురమున తిలకించుచు పక్షధరుడన్యమనస్కుడై స్నానార్థము నదికి బయలుదేరినాడు. త్రోవలో నొకచోట నిరువురు మనుష్యులు నాటి సభావృత్తాంతమును గురించి సంభాషించుచున్నారు. వారెవ్వరో కాదు. సభాపండితులే! వారి సంభాషణము వినదలచి పక్షధరుడించుక దూరమున నిలిచినాడు.

ప్రథముడు:— నా జీవితములో నిట్టి శాస్త్రవాదము వినియుండ లేదు సుమా! ఇట్టి వాక్చాతుర్యమును, ఇట్టి అసామాన్య భాషాగరిమతోడి యుక్తి ప్రయుక్తులును, ఇట్టి పాండిత్య ప్రాగల్భ్యమును ఇదివర కెవ్వరును ఎన్నడును కని విని యుండరు! ఈయువకుడు దైవాంశ సంభూతుడు సుమా!

ద్వితీయుడు:— నే నేమనుకొనుచున్నానో తెలియునా? రఘునాథుడు లేకుండిన పక్షధర మిశ్రుని గర్వము చూర్ణ మయ్యెడిదే. అట్టి దిగ్విజయ పండితుని వాదమును పక్షధరు డంత మనోహరముగా ఖండించగలడా? అని నా సందేహము.

ప్రథముడు:— ఖండించగలడో లేడో నాకు తెలియదు. పదిసంవత్సరములనుండి ఆయన శాస్త్రచర్చలు వినుచున్నాను. కాని ఆ యువకునివలె అంత నిపుణముగా ఆయన శాస్త్రార్థము చేసియుండలేదు.

పక్షధరుని నిర్మల మానసమున ఆకస్మికముగా కృష్ణ మేఘము లావరించినవి. అతని హృదయములోని ప్రతి పర మాణువును విషానల జ్వలితమైనది. దంతములతో నధరోష్ఠము కొరికికొనుచు దృష్టపద విక్షేపముతో నతడు నదీఘట్టమునకు బోయి స్నానముచేసినాడు. సంధ్యావందనము చేయబోయిన మంత్రము స్ఫురింప లేదు. భోజనముచేయబోయిన ఆహారము లోపలికి పోలేదు.

నాడు రఘునాథుడు పాఠము చదువరాగా పక్షధరుడు నూతన గ్రంథముతీసి ఆద్యంతములు మాత్రము చదివి గ్రంథ మతని చేతిలో నుంచెను. ఇతఃపూర్వ మాయన ఒక్కొక్క గ్రంథములో నొక్కొక్క విషయము చదివి వివరించి అతనికి నేర్పుచుండెడివాడు.

*

రఘునాథునకు అశ్రుతపూర్వమైన సమ్మాన లాభము కలిగినప్పటినుండి పక్షధర శిష్యమండలి హృదయములు దారు

ణాములైన అసూయాద్వేష జ్వాలలతో మండిపో జొచ్చినవి. ఇంతవరకును శిష్యులలో ప్రముఖులని ప్రఖ్యాతిగాంచి గౌరవ ప్రతిపత్తి నొందుచున్న వారందరును తమ కవమానము కలిగిన ట్లెంచుకొన్నారు. తత్ఫలితముగా వారిలో వారు రఘునాథునికన్న నిస్సంశయముగా నత్యుత్కృష్టమైన సమాధానము చెప్పి యుండెడివారము అని ప్రగల్భోక్తులు పలుకుచు రఘునాథుడు చేసిన ఖండనములోని దోషాభాసములు కుప్పలు కుప్పలుగా చూపింపదొడగిరి. కాని ప్రతిశిష్యుడును అసూయా దారుణ జ్వాలలతోపాటు హృదయాంతరములో 'రఘునాథుడు వాదించినట్లు వాదింపలేను' అని తన అసామర్థ్యమును అనుభవించుచునేయున్నాడు. అందువలన రఘునాథుని మీాద అందరకును అధికముగా అసూయా ద్వేషములు ప్రబలినవి.

*

పక్షధర శిష్యుడును, సభాపండితులలో నొకడును నగు సృష్టిధరుడు వచ్చి గురునికడ రఘునాథుని ప్రతిభావిశేషములనుగూర్చి శతముఖముల ప్రశంసించినాడు. పక్షధరుడు కేవలము ఊకొట్టినాడు. సృష్టిధరుడు మరికొంచెము పొగడినాడు. తోడనే పక్షధరుని కనుబొమలు ముడివడినవి. తరువాత నతడు మాటాడలేదు. గురుని మౌనమును గ్రహించి పంతసించి సృష్టిధరు డపుడు సవిశ్వాసముగా, "కాని రఘునాథుడు గొప్ప దాంభికుడు. అతని దంభము నణచివేయనిచో నతని మేధాశక్తి నిష్ఫలము కాగలదు" అని పలికినాడు.

పక్షధరుడొక్కసారి సందిగ్ధదృష్టితో నతనివంకచూచి కొంచెముసేపు ఊరకుండి తరువాత, "ప్రతిభ యుండినచో జనులు దాంభికు లగుదురు. దంభము లేనివారు ఎన్నిటికిని గొప్పవారు కాలేరు" అని వచించినాడు.

సృష్టిధరుడింక నేమియు మాటాడలేదు.

తరువాత కొన్నిదినములకు ఇంకొక శిష్యుడు శశధరుడు గురునికడకు వచ్చి, "విన్నారా, రఘునాథు డేమన్నాడో ? మిథిలలో పండితులు లేరట! మిథిలలోని పండితుడును వంధ్యాపుత్రుడును సమానమట!" అని చెప్పినాడు.

పక్షధరుడు భ్రూభంగముచేసి యూరకున్నాడు. శశధరు డింక ననేకములు రఘునాథుని గురించి వచించినాడు. విని విని చివరకు పక్షధరుడు, "అవును, రఘునాథుడు సత్యమే చెప్పినాడు. నేను లేకుండిన మిథిలలో పండితుడు వంధ్యాపుత్రుడే, శశవిషాణమే! సందేహములేదు" అన్నాడు.

మరియొకరోజున నింకొకశిష్యుడు వచ్చి యిట్లు చెప్పినాడు: "రఘునాథుని పుస్తకములలో నొకచోట నొకశ్లోకము వ్రాసి యున్నది. దానిని నేను కంఠస్థము చేయలేదు. కాని దాని తాత్పర్యమిది—చంద్రుడు ప్రకాశించుచున్నను ఖద్యోతము తన కాంతిని ప్రకటించుచునే యున్నది. ఇక పక్షధరుడు ప్రకాశించుచుండగా రఘునాథుడు స్వీయ తేజమును వెల్లడించలేడా?

పక్షధరుడు కను లెఱ్ఱజేసి, "ఇట్టి శ్లోకము రఘునాథుడు రచించినాడా? అత డంతటి సహనము లేనివాడు కాడు. మూఢుడా! మీ రందరు నన్ను మూర్ఖునిగా నెంచు

చున్నారా? మీ శతత్వము నేను తెలిసికోలేననుకొన్నారా?" అని చీవాట్లు పెట్టినాడు.

కాని ఈవిధముగా ఆనాడొకమాటయు ఈనాడొక మాటయు వినుచుండుటవలన రానురాను పక్షధరుని హృదయములో దారుణానలము రగుల్కొని లోలోపలనే పొగలుమియసాగినది. అయినను అది బయటబడకుండుటచే దానినెవ్వరును గుర్తింపలేదు.

కొంతకాలము కడచినది. ఒకనాడు రఘునాథుడాచార్యునికడ కరుదెంచి, "గురువర్యా! నావిద్య పూర్తియైనది కదా! నాకిక సెలవు దయచేయుడు" అని ప్రార్థించినాడు.

ఆమాట వినగానే పక్షధరుని అంతరములోని అసూయావిష మాకస్మికముగా కదలబారినది. అతడప్పుడనవసరమైన కోపముతో, "గర్వితార్భకా! ఇంతలోపలనే నీవిద్య పూర్తియైనదనుకొనుచున్నావా?" అని కసరినాడు.

"అట్లయిన గురువర్యులు నన్ను పరీక్షింప వేడుచున్నాను" అని రఘునాథుడు దృఢస్వరముతో విన్నవించినాడు.

"మంచిది. రేపు సప్తశలాకా చక్రము వేసి చూచి నీకు బిరుదు నొసగెదను" అని పక్షధరుడన్నాడు.

"గుర్వాదేశము శిరోధార్యము" అని నమస్కరించి రఘునాథుడు వెడలిపోయినాడు.

*

పరీక్షా నిమిత్తము ప్రవీణులగు శిష్యులందరు తగు జాగరూకతతో సిద్ధపడినారు. పరీక్షార్థియగు వాడు శిష్యు

లందరితోడను శాస్త్రవాదము చేయవలెను. వారి నందరను పరాజితులను చేసినచో అప్పుడతనికి బిరుద ప్రదానము. ఇది పక్షధరుని పరీక్షాప్రణాళిక. అందుకోసము శిష్యులందరు అప్రమత్తులై రఘునాథున కెంతమాత్రము జయము లభింపగూడదని దృఢప్రతిజ్ఞచేసికొన్నారు.

రాజసభలో పక్షధరుడు యథారీతి తన ఉచ్చపీఠము నధిష్ఠించినాడు. శిష్యులుగూడ యథాధికారము సోపానముల మీఁద నుపవిష్టులైనారు.

రఘునాథుడు పరీక్షాస్థానమున గూర్చుండి క్రిందిమెట్టు నుండి ఒక్కొక్క శిష్యునితో శాస్త్రచర్చ ప్రారంభించినాడు. శిష్యులు క్రమముగా నొకరి తరువాత నొకరు పరాస్తులైనారు. వారు పరాభూతులైనకొలది పక్షధరుని చిత్తము విచలితము కాసాగినది. "అసాధారణదాంభికుఁ డీబాలుఁడు! అందరిని గడ్డిపోచలక్రింద కట్టివేసినాడు సుమా!" అని ఆయన కక్కసపడినాడు. "ఈ మిథిలనుండి ఇంత గర్వముతో నితఁడనాయాసముగా నవద్వీపమున కరుగునాయేమి?" అని అనుమానించినాడు.

రఘునాథుడు చిట్టచివరి శిష్యునితో - ఆచార్య పాదతలమున గూర్చుండిన వానితో శాస్త్రార్థము చేయుచుండగా పక్షధరుని లలాటమున స్వేదబిందువు లుప్పతిల్లినవి. ఆయన ఆకస్మికముగా ఆత్మనిగ్రహమును గోలుపోయి, చటుకున పీఠము దిగివచ్చి శిష్యుని ప్రక్క గూర్చుండి, వానికుత్సాహము కలిగించువానివలె ప్రత్యుత్తరమును సూచించినాడు.

ఎట్లయినను విజయము రఘునాథుని వరించినది.

తరువాత రఘునాథుడు, "గురుదేవా! నేను పరీక్షయందుత్తీర్ణుడ నైనాను. నాకు బిరుద మనుగ్రహింపుడు" అని విన్నవించినాడు.

పక్షధరుడు తటాలున లేచి తన పీఠముమీద నిలబడినాడు. ఆయన సర్వాంగములు ఉద్వేగముతో కంపించినవి. త్రస్తపద విక్షేపముతో పీఠము దిగివచ్చి విచారస్థానమున గూర్చుండి ఆయన, దర్పిత బాలకా! నీవు నాతో శాస్త్రవిచారణ చేయవలెను'' అని గర్జించినాడు.

రఘునాథుడు ధైర్యముగా వచ్చి గురుపాదములకు నమస్కరించి, "చిత్తము. నేను సంసిద్ధుడను" అని పలికినాడు.

శిష్యులందరును గుమికూడినారు. గురు శిష్యులకు తర్కము జరుగనున్నదని తెలిసినంతనే బయటనున్నవారందరు సభలోపలికి వచ్చినారు. అంతఃపురాంగన లరుదెంచి యవనికాభ్యంతరముననాసీనలైనారు. సభయంతయు ఉత్కర్ణమైనది. పక్షధర రఘునాథులకు శాస్త్రవాద మారంభమైనది.

పక్షధరుడు పూర్వపక్షము నుపపాదించినాడు. ఆయన అలోకసామాన్య ప్రజ్ఞకును, అపారపాండిత్యమునకును, అనుపమాన వక్తృత్వమునకు సభాసదులందరు స్తంభితులైనారు.

పక్షధరుడు ఉపపాదనమును పూర్తి చేసినంతనే రఘునాథుడు మందస్మితవదనముతో ఆచార్యుని యుక్తుల నన్నిటిని చెల్లాచెదరు చేసి పూర్వపక్షమును హేలగా ఖండించినాడు.

అతని ధీగరిమకును, పాండిత్య విశేషమునకును, మనోహర వాక్చాతురికిని శ్రోతలు ముగ్ధులైనారు.

తరువాత పక్షధరుడు ప్రతిపక్షి ఖండనయుక్తులను నిశ్శేషముగా ఖండించి సుదీర్ఘముగా ప్రత్యుత్తర మొసగినాడు. దానిని రఘునాథుడు ఖండింపలేడని సభాజనులు భావించినారు. కాని రఘునాథుడు ఆచార్యతర్క మహారణ్యమును మూలముట్టుఅవలీలగా ఛేదించి నూత్నవినూత్న విషయములతో పూర్వపక్ష ఖండనమును ప్రత్యాఖ్యానము చేసినాడు. అతని ఖండనమునకు ప్రతియుక్తియుండునని అచటి పండితులెవ్వరును భావింపలేదు. ఎంత ఆలోచించినను వారికేమియు స్ఫురింపలేదు.

పక్షధరుడు మాత్రము చలింపలేదు. విస్మయోద్దీపకమగు వక్తృతాపటిమతో ఆయన దీర్ఘోపన్యాసము చేసి తన పక్షమును సమర్థించుకొన్నాడు. అప్పటికి వేళ యతిక్రమించుటచే నాటికి సభ ముగిసినది.

మరునాడు మరల శాస్త్రవిచారణ మారంభమైనది. ఆదినము సభకు మిథిలలో రానివారు లేరు. రాజసభాభవనము కిటకిట లాడిపోయినది. ఆనాటి తర్కయుద్ధ మెవ్వరును ఎన్నడును కని విని యుండరు.

పక్షధరుడు క్రమక్రమముగా అధికోత్తేజితుడు కాదొడగెను. రఘునాథుడు ధీరభావముతో ఉత్తరోత్తరము అతికఠినములు అసమాధేయములు అప్రతర్క్యములు నగు సునిశితయుక్తులను కొండరాళ్ళవలె దొర్లించసాగెను. పక్షధరు డిక తన యుక్తులు చాలవని తెలిసికొన్నాడు.

రఘునాథుని చిట్టచివరి ఖండము పూర్తి కాగానే, పక్షధరుడున్నట్లుండి ఉత్తేజిత కంఠముతో, "నీవు మూర్ఖుడవు. నీకు శాస్త్రమర్మములు తెలియవు. నీవు చేసిన ఖండనము ఖండనమే కాదు. నీవు పరాజితుడవు. నీకెట్టి బిరుదము లిచ్చు టకు వీలులేదు. దూరముగాపో" అని నిందించినాడు.

సభాసదు లందరు ఒకరి మొగము ఒకరు చూచు కొన్నారు. వాదములోని చివరిభాగము సూక్ష్మాతిసూక్ష్మము లగు అభినవనైయాయిక యుక్తులతో నడచినది. అందుచేత అచటి పండితులలో గొప్పవార మనుకొనువారు గూడ తద్యుక్తిమర్మములను గ్రహింపలేకపోయినారు. అందలి గుణ దోషములు రఘునాథ పక్షధరులు మాత్రము పరస్పరము గ్రహించినారు. అందుచేత ప్రకృత మెవరు జయించినారో ఎవరు పరాజితులైనారో ఎవరికిని తెలియలేదు. కాని రఘు నాథుడు పరాజితుడు అని పక్షధరు డెప్పు డన్నాడో అప్పు డందరు నిస్తబ్ధభావముతో రఘునాథుడు నిజముగా నోడి పోయినాడని తలచినారు.

తనకు జయము కలిగిన దనియు, తన గురువు తనను జయలాభమునుండి అక్రమముగా వంచించినాడనియు రఘు నాథు డెరుగును. విచారక్రోధము లతని హృదయమును భీకరముగా దండడిపెట్టినవి. నేత్రములుజపాకుసుమములైనవి. ముఖము కందగడ్డవలె జేవురించినది. శరీరము లేత తీగెవలె కంపించినది. శిరస్సులో అగ్నిజ్వాలలు ప్రజ్వలించినవి. అతడు

లేచి నిలుచుండి ఇంచుక తడవు ఆచార్యునివంక తీవ్రముగా చూచి బయటికి వెళ్ళినాడు.

వీధివెంట బోవుచుండగా నాగరకులు నాటి తర్కయుద్ధమును గురించి ప్రసంగించుచుండుట అతని చెవిని బడినది.

ఒకడు—బాబో! ముక్కాకలు తీరిన ముసలిబంటు తోడనా చమత్కారము! మిశ్రుడు తలచికొనిన ఇటువంటి రఘునాథుల నెందరినో నలిపి నస్యము చేయగలడు, ఏమనుకొన్నావో!

ఇంకొకడు—కావచ్చును. కాని ఆ పిల్లవాడు చాల గట్టివాడు. మిశ్రునితో అంతసేపు నిలబడి వాదించినవా డింత వరకును ఎవ్వడును లేడు.

మరియొకడు—ఎబ్బె! ఆ ఆడంబర మంతయు ఏమో తెలియునా? గారడివాడు మోడివేసి అవతలివానిని ఓడించుటకై నాగస్వరము బిగ్గరగా నూదుచు వెనుకకు వచ్చుచున్నట్లభినయించును. అదే తంతు ఇది తలచుకొనిన ఒక్క నిముసములో రఘునాథుని తలక్రిందుగా పడవేసియుండును. ఆయన ఎవరో కాదు, పక్షధరమిశ్రుడు, బాబూ!

రఘునాథుని అనర్గళ వక్తృత్వమును, అనుపమాన ప్రతిభను అన్యథాకరించుచు వేరొక డిట్లన్నాడు: ఇంత ఉన్నాడో లేడో ఆ బాలునికి ఏమి వాచాలత! ఎంత దర్పము! కాని ఆ చురుకుదనము ఆ డంభము అది యంతయు

ఇక్కడ సాగదు. పెద్దపులి గుహాలో మేకపిల్ల గంతులు వేయగలదా? ఇది నవద్వీపము కాదు, బాబూ! మిథిలానగరము—పక్షధరుని మిథిలానగరము!

అన్యుడు—ఇన్ని మాట లెందుకు? మిణుగురుపురువు సూర్యునితో బోటీ చేయగలదా?

ఈమాట లొక్కొక్కటి తప్తశలాకలవలె రఘునాథుని యంతరమును మాడ్చివేసినవి. అతడు దుస్సహామైన రోషముతో పండ్లు పటపట కొరికికొన దొడగెను.

నాడు పగలంతయు రఘునాథుడు నిర్జనప్రదేశమందును అరణ్యమందును గడపినాడు. అతని మనస్సులో అభిమానము, అవమానము, క్రోధము, ద్వేషము, ప్రతీకారము ఇత్యాదులు దావాగ్నివలె చెలరేగినవి. అతని జపానేత్రముల నుండి ఉష్ణాశ్రువులు నిర్ఘరిణులవలె ప్రవహించినవి.

గురువు అక్రమముగా తనను అవమానించినాడు. ఆయన అక్రమము ఆయనకు తెలిపి అందుకు యోగ్యమైన ప్రతీకారము చేయవలెను. ఎంతసేవటికిని ఇది యొక్కటే అతని ఆలోచన. ఎంత ఆలోచించినను ఏమియు ఉపాయము తోచలేదు. అజ్ఞానాభిభూతులైనవారు పండితులైనను, పామరులవలెను, పశువులవలెను వ్యవహరించుట మానవసహజము. వృద్ధులు, అభిజ్ఞులు, లోకజ్ఞులు మొదలైనవారే పశువ్యవహారమునకు పాల్పడుచుండ బాలకుడగు రఘునాథుని విషయము చెప్పవలసినదేమున్నది?

ప్రొద్దు కూకినది. రఘునాథు డాహారము తీసికొన లేదు. దాహము తీర్చికొనలేదు. జాము ప్రొద్దు పోయినది అత నికి నిలుకడ చిక్కలేదు. హృదయమునకు శాంతికలుగలేదు. అర్ధరాత్రము కావచ్చినది. తిరిగి తిరిగి విసిగి వేసారి కనులలో ప్రాణములు పెట్టుకొని ఉన్మత్తునివలె గురు గృహమునకు తిరిగి వచ్చినాడు.

*

మరునాటి ఉదయమున శిష్యు లందరు గుమికూడి అత్యుత్సాహముతో క్రిందటి రోజు జరిగిన సభావృత్తాంత మును మాటిమాటికి తడవుచు ఆనందింప సాగిరి. మత్సర గ్రస్తులు వివేకదూరు లగుదురుగదా! అందుచేతనే రఘునా థుని అవమాన మతని సహాధ్యాయుల కంత ఆనందకర మైనది. రఘునాథుడు వట్టి మూర్ఖుడు, దాంభికుడు; అతని గర్వమునకు తగినశాస్తి జరిగినది– ఇత్యాది నిర్ణయములతో వారి ప్రసంగము ముగిసినది.

పక్షధర మిశ్రుని సమ్మానార్థము ఆనాడు రాజసభ సమావేశమైనది. నాగరికులును, పండితులును అనేకులు సభకు విచ్చేసిరి. నాడు ఎవరికే శాస్త్రమునం దెట్టి సందేహము కలిగినను పక్షధర మిశ్రుడు తీర్చునను సాటింపు జరిగినది. అందుకోసము పండితు లనేకుల నాహ్వానించినారు. చేరిన విద్వాంసు లందరు పక్షధరశిష్యులతో గలిసి రఘునాథుని గర్వమును నిందించుచు గుసగుసలాడ నారంభించినారు.

అట్టి సమయమున పక్షధర మిశ్రుడు రఘునాధుని వెంటబెట్టుకొని సభకు విచ్చేసినాడు. సభాసదు లందరు చకితులై లేచి నిలుచుండి చిత్రిత ప్రతిమలవలె ఆశ్చర్యముతో చూడసాగినారు.

పక్షధరుడు వచ్చి తన యున్నత పీఠమున నుపవిష్టుడై రఘునాధుని ప్రక్కన గూర్చుండబెట్టుకొన్నాడు. సభాస్తారులు నిర్వాక్కులైనారు.

తరువాత పండితులు తమతమ శాస్త్రసందేహములను గూర్చి పక్షధరుని ప్రశ్నించినారు. పక్షధరుడు ప్రశ్నల కన్నింటికి హేలగా సమాధానము చెప్పినాడు. పిదప మహారాజు లేచి పక్షధరుని ప్రతిభా విశేషము లుగ్గడించి ముక్తాహారముతో ఆయన కంఠము నలంకరించినాడు. సభా భవనము జయజయ ధ్వానులతో ప్రతిధ్వనించినది.

అనంతరము పక్షధర మిశ్రుడు లేచి నిలుచుండి ఇంచుక తలవంచి ధీరభావముతో నిట్లుపలికినాడు. "మహారాజా! సభాసదులారా! నిన్నటి శాస్త్రవిచారణ సభలో ఈర్ష్యాభిభూతుడనై క్రోధాంధుడనై అన్యాయ్య మాచరించినాను. యథార్థముగా రఘునాధుడు జయించినాడు. నేను కేవలము వాగాడంబరము ప్రదర్శించి నా పరాజయము ప్రకటితము కాకుండుటకై ప్రయత్నించినాను. నా యవమానము కప్పిపుచ్చుటకై మిథ్యావాక్యములు పలికినాను. నేడు మీయందరి సమక్షమున నా యపరాధము నొప్పుకొనుచు నాయధర్మా చరణమును మన్నింప వేడుచున్నాను.

"నేడు నాజీవితములో చాలసుదినము. నేను మొదటి నుండియు 'పుత్రా దిచ్ఛేత్పరాజయమ్' అనునది జీవిత లక్ష్యముగా పెట్టికొన్నాను. నేడు నా కామ్యము సిద్ధించినది. గురునకు శిష్యునివల్ల పరాజయముకన్న మహానందము వేరొకటి లేదు. కనుక మీాయందరి సమక్షమున తనను జయించు శిష్యులను తయారు చేయునట్లు ఆశీర్వదించుచు రఘునాధునకు పండిత సార్వభౌము డను బిరుదము నొసగు చున్నాను."

ఇట్లు పలికి పక్షధరుడు తన కంఠమందలి ముత్యాల హారమును దీసి రఘునాధుని కంఠమునవైచి కౌంగలించుకొన్నాడు. సభ యంతయు జయఘోషముతో నిండి పోయినది. రఘునాధుడు ఆనందాశ్రుధారతో గురుచరణము లభిషేకించి నాడు.

# అనుక్త కథ

## ౧

రాత్రి ఎనిమిది గంటలు. చట్టగ్రామ ( Chittagong ) నగరములో పోర్చుగీసు దుర్గమందలి విశాల ప్రకోష్ఠము. అందు ఆసనాదులు చక్కగా అమర్చియున్నవి. మందానిలము మనోహరముగా వీచుచున్నది. అచట షేలియానాయును, కారోలోజోయును కూర్చుండియున్నారు. వారి ముఖమండలములు సముజ్జ్వల దీపాలోకములో ప్రకాశించుచున్నవి.

షేలియానా సౌందర్యవతి, సుశిక్షిత. ఆమె వయస్సు రమారమి పదునెనిమిది వత్సరములు. ఆమె దీర్ఘకాయమును పరిస్ఫుటావయవ సంఘటమును సముజ్జ్వల గౌరవర్ణమును, ఆయత నీలనయనములను, దీర్ఘశ్యామల కుంతలములను జూచి ఆమె ఏదేశ యువతియో చెప్పన చెప్పుటకు వీలులేదు. ధరించిన దుస్తులనుబట్టి ఆమె గొప్పయింటి మొగలు రమణి వలె తోచును.

అల్ఫాంజో ఆక్టేవియస్ కారోలోజో పోర్చుగీసు దేశీయుడు. అతని శరీరచ్ఛాయ సువర్ణ వర్ణమును సంధ్యాభ్ర వర్ణమును గాక లేత మొగలిరేకు వంటిది. నేత్రములును కేశములును శ్యామలములు. వయస్సు దాదాపు ఇరువదియేండ్లు. అతను పోర్చుగీసు దుర్గాధ్యక్షుడు, సేనాధిపతియు, నౌకాశ్రయాధిపతియు నతడే.

కారోలోజో మనోమండలములో కల్పనావాహినులు ఒక ప్రాంతమునుండి మరొక ప్రాంతమునకు మహావేగముతో ప్రవహించుచున్నవి కాబోలు, తేజోవంత మైన అతని ముఖ శ్రీమీద నడుమ నడుమ చింతాచ్ఛాయ లావరించు చున్నవి. షేలియానా చిరునవ్వుతో, "యుద్ధమెప్పుడు జరుగునను కొను చున్నారు?" అని యడిగినది.

కారోలోజో ధీర గంభీర భావముతో, "యుద్ధ ప్రారంభ సమయ మింకను స్థిరపడలేదు. షేలియానా! ఎట్టి సమయమందైనను శత్రువులు రావచ్చును. ఈ ముహూర్త మున వారు దుర్గము నాక్రమించినను ఆక్రమింప వచ్చును. ఈసారి రెండుమూడు దినములలో నౌకాయుద్ధము జరుగునని నే ననుకొనుచున్నాను. దాని ఫలితమునుబట్టి ఎవరి భాగ్య మెట్లున్నదో నిశ్చిత మగును" అని వచించినాడు.

ఇరువురును కొంతసేపటి వరకు మౌనము వహించి నారు. తరువాత ఉభయులును నిట్టూర్పులు విడిచినారు. ఎవ్వ రేమేమి భావించినారో!

కారోలోజో ఇంచుక విషణ్ణ హాసముతో, "షేలి యానా! నీవు మొగలులకే విజయము కోరుచున్నావుగదా!" అన్నాడు.

"కారోలోజో! నేను నీకడ నా మనోభావములను దాచను. నిజమే, నేను మొగలులకే విజయము వాంఛించు చున్నాను. కాని నీకోసము—"

నా విషయముతో నింక ప్రయోజన మేమున్నది, షేలియానా! మొగలులు గెలిచినచో వారు నా ప్రాణములు తీయుట—"

"ఎప్పుడును జరుగదు—"

"నిశ్చయముగా జరుగును. నన్ను చంపకుండ వారు ఈ చట్టగ్రామ దుర్గములో నెట్లు ప్రవేశింప గలరు? ఏ విధముగా ఈ మా ప్రాచీన దుర్గము నాక్రమింపగలరు ? "

కారోలోజో కంఠ ముత్తేజితమైనది. అతని నేత్రము లుజ్జ్వలములైనవి. షేలియానా నయనములనుండి అశ్రుధారలు కారుచున్నవి. అతని కావిషయమై దృష్టిలేదు.

కొంచెముసేపు ఊరకుండి పిదప నామె, " కారోలోజో నీకు కోపము రాదుగదా! నేనొక విషయము చెప్పదలచి నాను. " అన్నది.

" ఏ విషయము, షేలియానా! నిశ్శంకముగా చెప్పు. నే నెప్పుడైన నీ మాటలకు కోపగించుకొన్నానా ? కోపగింతు నని నేడెందు కాశంకించుచున్నావు ? "

మరల షేలియానా కనులనుండి అశ్రువు లురలినవి. హృదయము కృతజ్ఞతాభావముతో నిండిపోయినది. ఆమె ఏదో సంగతి చెప్పదలచినది. అది కంఠమువరకు వచ్చి అడ్డు తగిలిన ట్లాగిపోయినది. దానిని బహిర్గతము చేయుట ఆమెకు చాల కష్టమైనది. ఆమె ఇంచుక సంబాళించుకొని ధీరసందిగ్ధ స్వరముతో నిట్లన్నది : " కారోలోజో ! ఈదుర్గ మిప్పుడు

పోర్చుగీసులది కాదు. ఆరాకాన్ రాజుల యధీనములో నున్నది. చట్టగ్రామ నగరమునకు శాసకుడు— ”

అత డామె మాటల కడ్డువచ్చి మృదుస్వరముతో “ అవును, షేలియానా ! చట్టగ్రామశాసకు డిపుడు ఆరాకాన్ రాజే ! నగర మిప్పుడు ఆరాకాన్ రాజ్యాభు క్తమైనది. ఈదుర్గ మిప్పుడు పోర్చుగీసులది కాదు. ” అన్నాడు.

ఈ మాటలు పలుకునపుడు అతని ప్రాణములు నేత్ర ములనుండి బహిర్గతము లగుచున్నట్లున్నవి. అత డించుక నిగ్రహించుకొని, “ అయినను నేనే ఈ దుర్గాధ్యక్షుడను. నేను దస్యుడ నైనను విశ్వాసానర్హుడను కాను. ” అన్నాడు.

అపు డామె ముఖము లజ్జచేతను ఆత్మగ్లానిచేతను, ఒక్క క్షణ మారక్తమైనది. ఒక్క క్షణము మ్లానమైనది. దుర్గాధ్యక్షుడు విశ్వాసార్హుడు కాడని ఆమె చెప్పదలచుకొన లేదు. కాని చెప్పదలచినది కూడ చెప్పలేకపోయినది. తరు వాత నిరువురు చాలసేపటివరకు ఏమియు మాటాడ లేదు.

తరువాత కార్లోజ్ ఇట్లన్నాడు : “ షేలియానా ! ఈ యుద్ధములో మొగలులకు నిశ్చయముగా విజయము కలు గునో కలుగదో చెప్పలేను. కాని వారికి విజయము కలిగి నచో నాకు మృత్యువు మాత్రము నిశ్చయము ! మరణము నకు ముందు—జీవించియుండగనే—ఏ విషయము వినవలెనని నేటికి రెండు సంవత్సరములనుండి నిరీక్షించుచున్నానో అది చెవులార వినుట కవకాశము లభించునా ? నేను దస్యుడనే

కావచ్చును. కాని నా హృదయములో-" అతడిక మాటాడలేకపోయినాడు.

షేలియానా చటుకున లేచి అతని సమ్ముఖమున మోకరించి దీనముగా, "కారోలోజో! నేడు నన్ను క్షమింపవలెను. నా దృష్టిలో నీవు దస్యుడవు కావు. నేటికి నన్ను అనుగ్రహించు. నీ కా విషయము తరువాత చెప్పెదను." అని విలపించినది.

"తరువాత చెప్పెదవా, షేలియానా! ఈ దేహములో నుండి ప్రాణములు పోయిన తరువాతనా ?"

ఆమె నయనములలో భవిష్యద్దృష్టి పాదుకొన్నది. ఉత్తేజితస్వరముతో నామె, "ఈ యుద్ధములో నీ ప్రాణము లెంత మాత్రమును పోవు. నిన్నెవ్వరును చంపలేరు. కారోలోజో ! నా జీవితచరిత్ర—" అని ఏదో చెప్పబోయినది.

"నేను చెప్పెదవేని— షేలియానా! నీ జీవితచరిత్ర నేను వినిపించెదవేని శత్రువుల రహస్యము తెలిసినదానికన్న- వినిపించినదానికన్న వేయిమడుగు లెక్కువగా సంతోషించెదను. కాని నిన్నిక బాధించను. ఈ దీనుని జీవితచరిత్ర కూడ నీవు వినియుండలేవు. నేను నీవు వినదలచినచో—"

షేలియానా ఉత్సాహముతో లేచి అత్యంతాసక్తితో "నీవు నీ జీవితచరిత్ర వినిపింతువా, కారోలోజో ! చాల సంతోషము. అట్లయిన నేడే విందును. నేడే ఈ దీనురాలి జీవితకథను గూడ వినిపింతును." అన్నది.

ఆమె వాక్యము పూర్తియైనదో లేదో, సమస్తదిక్కులను, చట్టగ్రామనగరమును చుట్టియున్న సమస్త పర్వతములను, దుర్గప్రదేశమును, ఆకాశమును దద్దరిల్లజేయుచు రణవంశీనాదము మ్రోగినది. కాగ్లోజో తక్షణమే లేచిపోయినాడు. వారి జీవితవృత్తాంతము లనుక్తకథలైనవి పరస్పరము వానిని వినుటకు గాని, వినిపించుటకు గాని మరి వీలు కలుగలేదు.

౨

చట్టగ్రామ నగరమును అందలి పోర్చుగీసు దుర్గమును ప్రాచీరమువంటి పర్వతములచే పరివేష్టితములైనవి. నగరము గూడ గిరులతోడను గండశైలములతోడను నిండియున్నది. నగర ప్రదేశమున కొకవైపున సముద్రమును ఇంకొకవైపున పర్వత శ్రేణియు గలవు. పర్వతశ్రేణి నుండి కర్ణఫులీ మొదలైన నదు లుద్భవించి సముద్రములో గలియుచున్నవి. కర్ణఫులీ సాగర సంగమ ప్రదేశమునకు నగరము సమీపమున నున్నది.

పర్వత ప్రాకారము గల నగరదుర్గ ప్రదేశమునకు అందర్‌ఖిల్లా లేక అంతర్దుర్గము, అనిపేరు. దీనికి దక్షిణభాగము బాహిర్‌ ఖిల్లా లేక బహిర్దుర్గము అనిపేరు. బహిర్దుర్గము క్రిందనే కర్ణఫులీనది. ఈ నదిలోనికి సముద్రమునుండి ఓడలు మొదలైనవి వచ్చుచు బోవుచుండును.

* * * *

చట్టగ్రామ ప్రదేశమునకు పశ్చిమముగా సముద్రములో శోణద్వీప మున్నది. అది పోర్చుగీసులకు ప్రధానకేంద్రము. అది ఆరాకానుల వశమైనది. తన్మూలముననే వారు చట్ట గ్రామ ప్రదేశమున తమ అధికారమును నెలకొల్ప గలిగిరి. తరువాత వారి యదృష్టరేఖ వక్రించుటచే మొగలులు శోణ ద్వీపమును వశపరచుకొని చట్టగ్రామ ప్రదేశమును జయింప ప్రయత్నింపసాగిరి.

కార్లోజో పూర్వులు పోర్చుగల్ లోని శాంతి యాగో ప్రదేశమున కధికారులు. ఆ వంశజుడొకడు జూయువ తిని వివాహమాడుటచే అచటి చట్టము ప్రకారము నిర్వా సితుడై చట్టగ్రామమునకు వచ్చినాడు. అతనికి వంశాను క్రమమున రావలసిన పిత్ర్యమగు ఆస్తి రాలేదు.

తరువాత కార్లోజో తండ్రి ఆరాకాన్ రాజుల నిర్వాసితకన్యను వివాహమాడి పోర్చుగల్‌లోని ఆస్తివిష యమై అభియోగము తేవలెనని సకుటుంబముగా రోమునగర మునకు వెళ్ళి న్యాయవిచారణకోసము మతాధికారిని ప్రార్థిం చినాడు. అచట నుండు కాలములో నతనికి కార్లోజో జన్మించినాడు. విచారణ పూర్తిగాకపూర్వమే అతడు గతిం చినాడు. పిమ్మట కార్లోజో తల్లిని దీసికొని రోమునగర మును వదలినాడు.

* * * *

ఈ కథాకాలమునకు పది వత్సరములు పూర్వము గృహహీనుడును ఆత్మీయరహితుడును దేశవిచ్ఛిన్నుడును

సప్తదశవర్షవయస్కుడు నగు కార్లోజో కర్ణఫులీసాగరసంగమప్రదేశమున తల్లితో ఓడ దిగినాడు. నగరరమణీయత ఐంద్రజాలిక మోహనశక్తివలె అతని మనస్సు నాకర్షించినది. అచటి పర్వతదృశ్యము సముద్రతీరసైకతభూమి మొదలైనవి అతని కల్పనాశక్తిని మేల్కొలిపినవి. తత్ప్రదేశమున నతనికి స్వప్నములోవలె అభినవ జగత్తును నూతనసౌందర్యశోభయు కనిపించినవి. పితృపక్షీయ మగు పోర్చుగీస్ వంశగౌరవము అతని ఆత్మలో మెలగుచున్నవి. మాతృపక్షీయమగు ఆరాకాన రక్తము అతని నాడులలో ప్రవహించుచున్నది. అందుచేత నతనికి ఆరాకానులయెడ అభిమాన మేర్పడినది. తదుపరి అతడు పోర్చుగీసుయొక్కయు, ఆరాకానులయొక్కయు ఆధిపత్యరక్షణార్థ మాత్మవంచన లేకుండ ప్రయత్నింప నారంభించినాడు. తద్రక్షణోపాయములలో ప్రధానమైనది దస్యువృత్తి. ఆ కారణమున కార్లోజో కూడ దస్యుడైనాడు.

*　　*　　*　　*

చట్టగ్రాము దుర్గమునకు కార్లోజో అధ్యక్షుడైనప్పుడే మతాధికారి విచారణ పూర్తియైనది.

ఒకనాడు యూరోప్ ఖండమునుండి వచ్చిన యోడలో కార్లోజోకు ఉత్తరములు మొదలైనవి చాల వచ్చినవి. అందులో నొక కాగితములకట్టమీద అతనిపేరు వ్రాసియున్నది. ఆ కట్టలో నొక లేఖయు, వ్యావహారికపత్రములును గలవు. అతడు వాని నొకసారికి రెండు సారులు చదివినాడు.

కాంగోలోజో ముఖమండల మొకసారి ఆనందజ్యోతిచే నుద్భాసితమైనది. అది ఒక్కసారి మాత్రమే! తోడనే అది గంభీరభావము వహించినది. దృష్టిలో చింతాభావము ప్రకాశితమైనది. పోర్చుగల్ అతని దృష్టిలో నామమాత్రము. చట్టగ్రామ నగరము వాస్తవికము. కర్ణఫులీసాగర సంగమ ప్రదేశము అతని జీవితమున కంతటికిని కేంద్రభూమి. పారవశ్యోన్మాదముతో నతడా లేఖను పత్రములను బంతులవలె ఎగురవేయ నారంభించినాడు. వానిలోని విషయ మింకొక ప్రాణికి గూడ తెలియదు.

3

ఈ కథాకాలమునకు రెండు సంవత్సరముల పూర్వము నవాబ్ సైస్తఖాన్ ఔరంగజేబ్ క్రింద వంగదేశమునకు సుబేదారుగానుండి తత్పశ్చిమ రాజధానియగు రాజమహాలునకు వచ్చియున్నాడు. ఆ సమయమున ప్రాచ్యవంగములో ఆరాకాన్ పోర్చుగీస్ సముద్రదస్యులు క్రూరకృత్యము లొనర్చుచుండిరి. సముద్రతీరము మొదలు ఢాకానగర సమీపప్రదేశమువరకు వారి ఘోర కృత్యములకు జనులు భయకంపితులగుచుండిరి.

ఢాకాకు తిరిగివచ్చి, నూతనదళము నాయత్తముచేసి, దస్యుల నణచుటకై యుద్ధయాత్ర చేయుటకు సంకల్పించుకొని స్వల్పసంఖ్యాకమగు సైన్యమును, పది రక్షక నౌకలను మాత్రము వెంటబెట్టుకొని సైస్తఖాను జల మార్గమున బయలు దేరినాడు.

నవాబ్ భ్రాతృపుత్రుడగు ఈబ్రాహుసేన్ ఖాను బాల్యప్రభృతి సూక్ష్మబుద్ధియు, వివేచనయు, ధైర్యసాహసములును, స్థిరసంకల్పమును గలవాడు. అతని వయస్సు రమారమి ఇరువదిరెండేండ్లు. అతని మాతాపితలు శైశవమునందే గతించినారు. నవాబు అతనిని పుత్రునివలె పెంచినాడు. అతని కింకను వివాహము కాలేదు.

సైస్తఖాను తల్లిదండ్రులులేని బాలిక నొకదానిని పెంచినాడు. బాలిక చిన్నతనమునుండి ఈబక్‌తో ఆడుకొనుచుండెడిది. ఆమె అసామాన్యసుందరి. అప్రతిమాన తేజస్విని. ఆమెతండ్రికిని సైస్తఖానుకును బంధుత్వము కలదు. సైస్తఖాను ఆబాలికను దగ్గరకు తీసికొని తన అంతఃపురమందుంచి విద్యాబుద్ధులు నేర్పించినాడు. ఆమె వ్యావహారికనామము ప్యారాబీబీ.

ప్యారాబీబీని ఈబక్‌హుసేను కిచ్చి వివాహముచేయవలెనని సైస్తఖాను అభిలాష. ఉభయుల మనోభావములు గూడ అందు కనుకూలముగా నున్నట్లు తెలిసికొన్నాడు. ఢాకానగరము చేరగానే వివాహము జరిపించవలె నని నిశ్చయించుకొన్నాడు. అప్పటికి ప్యారాబీబీ వయస్సు సుమారు పదునారు వత్సరములు.

* * *

నవాబు నౌక సహజగతికన్న నెక్కుడు వేగముగా ప్రయాణించుచు మూడువంతుల దూర మతిక్రమించినది. ఇంక నొక్క వంతు పోయిన ఢాకానగరము సమీపించును.

రాత్రికాలము. మనోహరమైన జ్యోత్స్న. నవాబు నావలు తెరచాపలు విస్తరించి మహావిహంగములవలె పోవుచున్నవి. సుసజ్జితమైన నౌకయందు నవాబును నాయన భ్రాతృపుత్రుడును సంభాషించుచున్నారు. ఇంకొక నావయందు అంతఃపుర రమణీగణ మున్నది. దానియందే ప్యారా బీబీ నిద్రించుచున్నది. రక్షకనౌకలు శ్రేణీబద్ధమై ఎంత జాగరూకతతో ప్రయాణించుచున్నను గతిభేదముచే నొక్కొక్క నావ శ్రేణీవిచ్ఛిన్నమై పోవుచున్నది.

అర్ధరాత్రము. మందానిలముచే నదీవక్షము కొంచెము కంపించుచున్నది. నగరము సమీపించుచున్నదనియో, అట్టి శాంత మనోహర రాత్రివేళ విపదాశంక యుండదనియో నౌకారక్షకు లందరు నిద్రపోయినారు.

మరునటి క్షణములో చిన్ననావ యొకటి నౌకాదండముల త్రోద్రోపులచే గబగబ నవాబునౌక నతిక్రమించి ముందుకు వచ్చినది. తోడనే 'గుడుం గుడుం' శబ్దములతో తుపాకులు పేలినవి. నవాబు పడవ తెరచాపలకు తూట్లు పొడుచుకొని గుండ్లు పడవలోనికి పోయినవి. వెంటనే పడవ గిరగిర తిరుగుచు పోయి ప్రక్కపడవకు ఆనుకొన్నది. అందుచేత నది మునిగిపోలేదు.

నావికు లందరు నవాబు నౌకను రక్షించుటకై వ్యగ్రులైరి. రక్షకనావలు పారిపోవుచున్న క్రొత్తపడవ వెంట పరువెత్తినవి. అట్టి సమయమున వెనుకనుండి యింకొక నావ వడిగా వచ్చి ప్యారాబీబీ యున్న నావ నాక్రమించినది. రెండు

నౌకలనుండి తుపాకులు ప్రేలినవి. ఉభయపక్షములందును కొందరు హతులైనారు. అయినను ప్యారాబీబీ నావలో నేమి జరుగుచున్నదో నవాబు నావలోనివారు సరిగా తెలిసికొనుటకు పూర్వమే ఆరాకాన్ దస్యుడు వచ్చి ప్యారాబీబీ నెత్తికొని తన నావలోనికి కొనిపోయినాడు. తరువాత అతని నావ అపారజలరాశిపై నత్యంతవేగముతో పరువువారి అదృశ్యమైనది. అది ఎటుపోయినదో ఎవ్వరును కనిపెట్టలేక పోయినారు.

౭

కారోలోజో చట్టగ్రామదుర్గమునకును నౌకాదళమునకును అధిపతిగా నుండుటయేకాక ఆరాకాన్ రాజప్రతినిధిగా గూడ నున్నాడు, అందుచేత పోర్చుగీస్ ఆరాకాన్ దస్యులమీదగూడ నతనికి ఆధిపత్య మున్నది. నడుమ నడుమ నతడు ఢాకా నగరాంచలమందలి నదీమార్గమున నౌకారోహియై సంచరించుచుండును. ఆరాకాన్ పోర్చుగీస్ జలదస్యుల నడుమ కలహములు గాని, సంఘర్షణములు గాని సంభవించినప్పుడు వానిని నివారించి వారి యుభయులశక్తిని ఏకముచేసి మొగలులను ప్రతిరోధించుట అతనిముఖ్యోద్దేశము.

జ్యోత్స్నా ధవళితము, శాంతము, నిర్మలమగు నాటి రాత్రి అతడు నదీమార్గమునపోవుచున్నాడు. నదిలో నొకచోట పెద్ద నౌకనుండి స్త్రీకంఠ నిర్గతమగు నార్తనాదము బయలు వెడలి సుడులు తిరుగుచు పై కెగిరి ఆకాశమున లీనమగుచున్నది. ఆ సమయమున కారోలోజో అచటికి వచ్చుట

తటస్థించినది. అప్పు డాకస్మికముగా ఆ రోదనధ్వని అతని చెవిని బడినది. అతడు నిదానించి విని ఆనౌకలో నిస్సహాయ యగు రమణిపై నెవ్వడో పశుబలము ప్రయోగించుచున్నా డని గ్రహించినాడు.

కార్లోలోజో తోడనే పెద్ద పడవమీద తుపాకి పేల్చి నాడు. పడవ నడుమ నున్న నావికులు నదీజలములో పడి పోయినారు. మధ్యభాగము జనశూన్య మగుటచే నౌక గిర గిర తిరుగ నారంభించినది. ఈ లోపల కార్లోలోజో నావ దానిని సమీపించినది. 'భయము లేదు, భయము లేదు' అని అరచుచుపోర్చుగీసు వీరుడు ఆ పడవలోనికి దూకినాడు. సేనాపతివచ్చి ఎదుట నిలుచుండినంతనే ఆరాకాన్ దస్యుడు స్తంభితుడైనాడు.

కార్లోలోజో విస్మయవిస్ఫారిత నేత్రములతో విపన్న యగు నా వరవర్ణినివంక జూచినాడు. సౌందర్యైశ్వర్యములు మూర్తీభవించినట్లున్న ఆ యువతి సింహీవలె విక్రమించి ఆత తాయిని ప్రతిరోధించుచున్నది. సేనాపతిని జూచి తనను రక్షింప వచ్చినాడని గ్రహించి వెంటనే ఆ తరుణి అతని చరణ ములమీద బడి మూర్ఛపోయినది.

కార్లోలోజో ఏమియు మాటాడక దస్యునిమీద తీక్ష్ణ దృష్టి బరపినాడు. ఆ దృష్టిలోని క్రోధమును తిరస్కారమును జుగుప్సయు తీవ్రాగ్నిశిఖలై దస్యుని అస్తిత్వము నావరించి నవి. ఆ దృష్టిజ్వాలలను సహింపలేక ఒక్కదూకున నతడు నదీగర్భమున బడి మునిగిపోయినాడు.

౫

రెండు సంవత్సరములు గడచినవి. కార్గోలోజో ఒకప్పు డామెను షేలియానా అనియు మరియొకప్పుడు షేలీ యనియు పిలుచుచుండును. ప్యారాబీబీ అను పేరుగాని ఆమె జీవితగాథ గాని అతనికి తెలియదు. "షేలియానా మొగలుపుర బాలిక, ఆమె దొంగల చేతులలో జిక్కినది. —" అంతవరకే అతనికి తెలిసినది.

షేలియానా మొగలు విద్యాబుద్ధులు నేర్చినది. కార్గో లోజో ఆమెకు ఐరోపీయ విద్యాశిక్షణ నేర్పినాడు. ఉభయ ప్రణాళికల ననుసరించిన శిక్షాసమ్మేళనముతో నామె చట్ట గ్రామదుర్గములో నివసించుచున్నది. ఇప్పు డామె మొగల్ అంతఃపురములోని మాధుర్యమండితయగు ప్యారాబీబీయే కాక నవ్యకళాశోభితయగు ప్యారాబీబీ యైనది. గృహములో నున్నప్పు డామె మొగల్ రాజకన్యవలె దుస్తులు ధరించును. సమయాంతరములందు ఐరోపీయపద్ధతి ననుసరించి దుస్తులు ధరించి నిర్బాధముగా బయటికి వెళ్ళి ఆవశ్యకములగు వ్యవ హారములు చక్కబెట్టుచుండును. ఇంటిలో నున్నప్పుడు పుస్త కములు చదువుచు, వాద్యములు వాయించుచు, సంగీతము పాడుచు కాలము గడపుచుండును. అవసరము వచ్చినప్పుడు సైనిక వేషము ధరించి అశ్వమెక్కి తిరుగుచు తుపాకులను కూడ పేల్చుచుండును.

షేలియానాకు సంకేతజ్ఞాపనార్థము కార్గోలోజో ఉంగర మొకటి యిచ్చినాడు. దానివల్ల నామె పోర్చుగీస్ ఆరా

-కాక సైనికుల నడుమ వచ్చుచు పోవుచు నిరభ్యంతరముగా తిరుగుచుండును.

కారోలోజో నిర్వికార హృదయాంతరములో ఏనా డెట్టి ముహూర్తమున షెలియానా పవిత్రమూర్తి అధిష్ఠిత మైనదో తెలియదు. కాని అత డామెను గాఢముగా ప్రేమించినాడు.

ఆమె జీవిత వృత్తాంతము నతడు తెలిసికొన నిచ్ఛగించలేదు. "ఆమె తనంతట తాను నన్ను భర్తగా వరింపదేని, నే నామెమీది ప్రణయమును హృదయపీఠమున ప్రతిష్ఠించుకొని జీవితములోని శేష ముహూర్తము వరకు పూజించుచుందును. కాని భిక్షుకునివలె ప్రతి ప్రార్థినై దానికి అధఃకరణము కలిగింపను" అని అతడు దృఢముగా నిశ్చయించుకొన్నాడు.

ఆమెకు అతని జీవితగాథ తెలియదు. కాని ఆమె దృష్టిలో నతడు ఐహిక ప్రేమకు అత్యున్నత పీఠకపై ప్రతిష్ఠించిన గురువు, శిక్షావాత, రక్షకుడు, ప్రాణత్రాత – కేవలము దేవత! అట్టియిన నామె ఈబక్ హానేనుకు వాగ్దత్త గదా, కారోలోజోను వివాహమాడగలదా? లేదు. అవసర మైనచో అతనికోసము ప్రాణములనైన నీయగలదు. కాని వివాహము మాత్రము చేసికొనలేదు. అట్టియెడ "నేనునిన్ను వివాహ మాడలేను" అని అతని కేల చెప్పరాదు? ఆయొక్క మాటతో హిమాలయమువంటి అతని హృదయము 'అగాధ

సురంగమై పోవును. అందుచేతనే ఆమె తన హృదయము నింతవరకు ప్రకటింపలేదు.

షేలియానాకు మొగలుల యుద్ధయాత్రా విషయ మంతయు తెలియును. అయినను ఆమె తననెప్పుడును మోస గించదనియు, తన విషయమున నక్రమ వ్యవహార మెన్న డును ఆచరింపదనియు కార్లోజ్ దృఢవిశ్వాసము. నిజమే. అతని నెవ్వరైన స్పృశించినను గూడ ఆమె సహింపలేదు. అయినను ఆమె మొగలులకే విజయమును గోరుచున్నది.

నవాబ్ సైస్తఖాను నామాంకిత మగు అంగుళీయక మొకటి షేలియానావద్దనున్నది. అది కార్లోజ్‌కు తెలియదు. ఆ ఉంగరమువంక జూచినపుడెల్ల ఆమె మనస్సు పరవశ మగు చుండును. ఆ మొగలు అంతఃపురము, ఈబక్‌హానేసుతోడి ఆ ఆబాల్య ప్రణయము, సైస్తఖానుని ఆ దయాదార్యము, ఆ పితృవాత్సల్యము మొదలైనవి ఒక్కసారి ప్రత్యక్ష మగును. తోడనే ఆమె నేత్రములు బాష్ప పూరితము లగును.

ఇంకొకప్పుడు ఆభీషణరాత్రి, దస్యులు తననుఅవమా నింప యత్నించుట, కార్లోజ్ తనను రక్షించుట, అతడు తనను మర్యాదతో పాలించుట, శ్రద్ధతో విద్యాశిక్షల నొస గుట, అందువలన తన మానవత్వమును నారీత్వమును నూతన ప్రాణములనొంది తేజరిల్లుట మొదలైనవి తలచి కొని నంతనే ఆమె హృదయము భక్తి శ్రద్ధల తోడను కృతజ్ఞత తోడను నిండిపోవును.

మొగలులకు విజయము కలుగవలె ననియు, ఈబక్ హుసేనుతో తనకు వివాహము కావలె ననియు షేలియానా ఆకాంక్షించుచున్నది. ఆమె కింకొక కోరిక గూడ కలదు - చిన్నతనము నుండి తనను పెంచి పెద్దదానిని జేసిన వాత్సల్య పరిపూరిత హృదయుడు నవాబును, ప్రేమైకనిధి ఈబక్ హుసేను ఈ పోర్చుగీసు వీరుని ఒక్కసారి చూడవలెనని. ఈ పోర్చుగీసు దస్యుడు - దస్యుడా? అట్టి విపత్సమయమున ప్రాణదానము చేసిన మహనీయుడు! ఆ సమయమున నవాబ్ సైస్తఖాను గాని, ఈబక్ హుసేనుగాని, సమస్త మొగలు సైనికశక్తిగాని, దహ్లీ పాదుషా ఆరంగజేబ్ గాని తనకే మాత్రము సాహాయ్యమును చేయజాలియుండరు. ఆహా! మొగలు లీ దస్యువీరు నొక్కసారి తిలకించినచో, తమ పక్షమున నియోగించుకొన గలిగినచో! -ఆమె నేత్రములు సంతోషోత్సాహ విస్ఫారితములైనవి.

షేలియానాకు కారోలోజో చరిత్ర దెలియదు. కాని అత డామె కథ విన్నచో ఆ ముహూర్తముననే నవాబు కడకు పంపించి ఆమె వివాహమునకు తగిన అవకాశము కలిగించియుండును. అది సత్యము. అట్లు జరిగినచో ఆమె అతని నొక్కసారిగా పోగొట్టుకొనిన దగును. షేలియానా ఈబక్ హుసేనుని వివాహమాడుట కెంత అతురత పడుచున్నను, కారోలోజో ఔదార్యమహన్నును, అతనివల్ల తనకు లభించిన వినూత్నాత్మ విశ్వాసమును విచ్ఛిన్నము చేసికొని పోగోరుటలేదు.

కారోలోజో అట్టి మహనీయుడు గనుకనే ఆనాటి రాత్రి అతడు తన జీవితగాథను చెప్పనెంచినంతనే పేలియానా మహోచ్ఛ్వాసముతో వినగోరినది. అట్లే తన జీవితకథను గూడ వినిపింపదలచినది. కాని యుద్ధవంశీనాదము ప్రళయ నిర్ఘోషమువలె మ్రోగుటచే వారి కథలు అనుక్తకథలైనవి. పరస్పరము వినుటగాని, వినిపించుటగాని సంభవించలేదు. ఆ క్షణముననే యుద్ధమారంభమైనది.

ఆరాత్రి పేలియానాకును కారోలోజోకును అన్యోన్య దర్శనము కలుగలేదు. యుద్ధములో అతనికెట్టి ఆపదయు కలుగకుండుటకై ఆమె బాష్పపూరిత నయనములతో భగవంతుని ప్రార్థించినది. పిదప తనశయన కక్ష్యలో గూర్చుండి తన కర్తవ్యము నాలోచించి నిశ్చయించుకొన్నది. మనస్సు ఉత్తేజితమగుటచే నామె కారాత్రి నిద్ర పట్టలేదు.

౬

మొగలు సైన్యము స్థలమార్గమున వచ్చి చట్టగ్రామ దుర్గము నాక్రమింప సిద్ధముగా నున్నది. ఈబక్ హుసేను జలమార్గమునకు ముఖ్యమైన నావలను శోణద్వీపసమీపమున నిలువ యుంచినాడు. తాను మూడువందల నౌకలతో కర్ణఫులీముఖమున సముద్రతీరమందు సిద్ధముగా నున్నాడు.

చట్టగ్రామములోని పోర్చుగీసులును, ఆ రాకానులును సముద్రయుద్ధము కోసము అసంఖ్యాకములగు నావలతోడను, అసామాన్యసైనిక శక్తితోడను సిద్ధముగా నున్నారని ఈబక్ హుసేనుకు వార్త వచ్చినది. అగణ్యములగు శత్రుపఙ్క్తియు

నావలు కొన్ని ఆరాకాన్ నుండి వచ్చినవి. కొన్ని సముద్ర తీరమున నిలువయున్నవి. మరికొన్ని చట్టగ్రామ సమీపమున సముద్రవక్షమందు సిద్ధముగా నున్నవి.

ఈబర్ హుసేనుకు అప్పటికి ఇరువదిమూడు వత్సరముల వయస్సు. అతనిని బాలకుడన్నను అనవచ్చును. నవాబు నూతనదళమున కంతటికిని అతనిని సేనాపతిగా నియమించినాడు. ప్రబల పరాక్రాంతుడు దహాలీపాదుషా ఆరంగజీబ్ యశస్సును, సమస్త మొగలుజాతి గౌరవమును అతని హస్తములందు సమర్పితములైనవి. అతని ఆధీనములో స్వల్ప సంఖ్యాక మగు నౌకాదళమున్నది. దానితో నతడు మొగల్ కీర్తిని సముద్రములో ముంచునో తేల్చునో?

ఒక్క ముహూర్త మాలోచించి ఈబర్ హుసేను తన కర్తవ్యమును నిర్ణయించుకొన్నాడు. రణకౌశలము తన కెంత గొప్పగా నున్నదో అంతకన్న నెక్కువ యుద్ధాభిజ్ఞులును, సేనానాయకులును వీరగౌరవాన్వితులును చాలమంది ఆ ప్రదేశమున నున్నారని గ్రహించినాడు.

ఈబర్ హుసేను తన నౌకలను ఒకదాని వెనుక ఇంకొకటి చొప్పున సముద్రతీర సమీపముననే నిలిపియుంచినాడు. ఆ విధముగా మొగలు నౌకాశ్రేణి రేఖారూపము నొంది ఎదుటినుండి చూచువారికి కొలది నౌకలు మాత్రమేఅన్నట్లు గోచరించును.

కారోలోజో ప్రత్యూషమున లేచి బాహిర్ ఖిల్లావైపు వెళ్ళినాడు. యుద్ధము ముఖ్యముగా సముద్రములోనే జరు

గును. అందు కచటి సన్నాహము పరిశ్యక్షముగా చూచి కర్ణఫులీసాగర సంగమప్రదేశ మెట్లు సురక్షితమైనదో పరిశీ లింప దలచినాడు.

చట్టగ్రామ పర్వతములమీద పోర్చుగీస్ తుపాకులును ఫిరంగులును సిద్ధపరచి యున్నవి. అంతటను సమస్తమైన ప్రహ రకులు జాగరూకులై నిలిచియున్నారు.

౭

మధ్యాహ్నము. ఆకస్మికముగా ఆకశము మేఘాచ్ఛన్న మైనది. ప్రకృతి స్తంభించినది. శీఘ్రకాలములో ప్రళయము వలె ఝుంఝూవాతము ఆరంభమగునట్లున్నది.

కార్లోలోజో చట్టగ్రామ నౌకాదళముతో కర్ణఫులీ నదీ ముఖమున వేచియున్నాడు. అతడున్న ప్రదేశమునుండి ఈబర్‌హాంసేను నౌకాదళము కనబడదు.

ఆకాశమున మేఘము లొక్కపెట్టున గర్జించినవి. ఉన్నట్లుండి కడలినంతయు కలగుండు పరచుచు ఝుంఝూవా తము మహావేగముతో వచ్చిపడినది.

అదే మంచితరుణమని ఈబర్‌హాంసేఁ అసమానసాహ సముతో తన నౌకాదళమును సముద్రమార్గమున కర్ణఫులీ ముఖమునకు తీసికొనిపోవ నిశ్చయించినాడు. అట్టి సమయమున పోర్చుగీస్‌యోద్ధ వేషముతో అశ్వారోహియొకడు అతనినౌక కడకువచ్చినాడు. యోధుడుపోర్చుగీస్ నౌకారక్షకులకుపోర్చు గీస్‌అంగుళీయకమునుచూపించి నిరభ్యంతరముగా వచ్చినాడు. అతడు మొగల్ నౌకాదళమువద్దకు వచ్చి ఇంకొక అంగుళీయ

కమును చూపించినాడు. పోర్చుగీస్ వేషముతో నున్నను మొగలు సైనికు లతనిని నిరోధించలేదు సరికదా సంభ్రమ ముతో వారి నడలినారు. మొగల్ సైనికుడొకడు వచ్చి అతని గుర్రమును పట్టుకొన్నాడు.

ఆ గంతుకుడు దళాధిపతి నౌకలోని కెక్కినంతనే ఈబరా హీంసేను అత్యంతాశ్చర్య సంతోషములతో, "ప్యారా పేటె, షెలియానా!" అని బిగ్గరగా పిలిచినాడు. ఓష్ఠాగ్రమున అంగుళ్యగ్రముంచి షెలియానా మాటాడవలదని సంజ్ఞ చేసినది.

అపుడు మహావేగముతో వాయువు వీచినది. ప్రచండ వృష్టి ప్రారంభమైనది. సముద్రము భీషణ హుంకారముతో ఆలోడితము కా నారంభించినది.

ఈబరాహీంసేను నావలను వదలుట కాదేశ మొసగినాడు. మొగల్ సైనికు డొకడు మరియొక సైనికునితో "ఈ గాలివానలో సముద్రములోనికి పడవలనువదలుట కేవలము పిచ్చివాని పని" అన్నాడు.

ఆ మాటలు విని ఈబరాహీంసేను, "నిజము. ఆ పిచ్చివాడను నేనే! కాకున్న ఇట్టి యుద్ధము చేయుటకై వచ్చియుండను. బుద్ధి స్థిరముగా నున్నవారుండుడు. లేనివారు వారి గృహములకు పోయి ప్రాణములు నిలబెట్టుకొనుడు. నేను మాత్రము సముద్రములోనికే పోయెదను. వదలుడు నౌకలను" అని గర్జించినాడు.

ఒక్క ముహూర్తకాలములో నౌకలన్నియు తీరమును వీడి తరంగములలో బయలుదేరినవి. తరువాత ఆ భయంకర ఝంఝూవాతములో నెవ్వరేదిక్కున బోయిరో ఎవరికిని తెలియదు.

౮

రెండుదినములు వరుసగా దిక్కులనన్నిటిని అంధకార బంధురముల జేసి ఝంఝూవాతము చెలరేగినది.

ఆరాకాన్ పోర్చుగీస్ నౌకలా గాలివానలో ఆ కటికి చీకటిలో సముద్రములోనుండి ఫిరంగులు వదలినవి. శోణ ద్వీపము నైపునుండి మొగలు నూతనదళము సమాధానము చెప్పినది.

ఈబక్ వాలుసేను నౌకా శ్రేణినుండి చప్పుడేమియు విన వచ్చుటలేదు. "మొగలు లింకను చాలదూరమున నున్నారు. అంతేకాక చట్టగ్రామమున కింత సమీపములో నిన్ని యుద్ధ నౌకలు సిద్ధముగా నుండగా మన కీయుద్ధములో నెంత మాత్రము భయములేదు" అని ఆరాకానులును పోర్చుగీసు లును భావించినారు.

ఒక్క ముహూర్తకాలము భ్రాంతిపడి కార్లోలో కూడ అట్లే భావించియుండవచ్చును. వెనుకనుండి తెలియ కుండ మొగల్ యుద్ధనౌకలు కర్ణఫులీ ముఖమున ప్రవేశించు నేమో అను సందేహముతో ఆతడు తన నావల నన్నింటిని కర్ణఫులీమధ్యభాగమునకు జేర్చి, ఉభయతీరముల నానియుండు

నట్లు శ్రేణీబద్ధముచేసి నదీమార్గమును పూర్తిగా నరికట్టినాడు.

కార్లోజో తన జీవితములో నెన్నడును ఇట్లు పొరపాటు పడియుండడు. ఎట్టి ధీమంతునకైనను విధి విధానము ననుసరించి సమయము వచ్చినపుడు బుద్ధి పెడదారి త్రొక్కుచుండుట సహజముగదా!

౬

శోణద్వీపము వైపునుండి వచ్చిన మొగలు నౌకాదళము ఆరాకాణ్ పోర్చుగీస్ నౌకల దృష్టిపథములోనికి వచ్చినది. తోడనే ఆ నౌకలనుండి ఫిరంగులు గర్జించినవి. మొగలు నౌకలందుకు ప్రతీకారము చేసినవి. ఉభయపక్షములందును చాలమంది ఆహతులైనారు, హతులైనారు.

కర్ణఫులీముఖమునుండి ఈబన్ హూసేను తన పడవల నుండి కార్లోజో పడవల మీదికి ఫిరంగులు బారుచేసినాడు..

కర్ణఫులీముఖమునుండి మొగలు ఫిరంగులా! కార్లోజో శిరముమీాద ఆకాశము విరిగిపడినట్లైనది. దారుణరోష సంక్షోభములతో నతడు సింహగర్జనము చేయుచు తన నౌకల నుండి ఫిరంగులు పేల్చినాడు. మొగలు నావలు కొన్ని ముక్కలు ముక్కలుగా పగిలిపోయి కర్ణఫులీజలములలో మునిగిపోయినవి. అయినను ఈబన్ హూసేనుని మిగిలిన నౌకలు ద్విగుణీత్సాహముతో ఫిరంగులు వదలినవి.

కర్ణఫులీముఖమునుండి మొగల్ ఫిరంగుల శబ్దము వినబడినంతనే ఆరాకాణ్ పోర్చుగీస్ నావికయోధులు మొగలులకు విజయము కలుగుచున్నదని భావించినారు. అప్పటికిని

వారు వారి పడవల నుండి ఫిరంగులు పేల్చుచునే యున్నారు. కొన్ని పడవలు పగిలిపోయినవి, కొన్ని పారిపోయినవి.

కాగోలోజో యథార్థముగా పంజరాబద్ధుడైనాడు. తన పక్షము నౌకలన్నియు అరాకాన్ ప్రదేశముపైపు పోయినవి. ఒక్క దుర్ముహూర్తములో భ్రాంతికి లోనై [illegible] గర్భములోనికి ప్రవేశించినందులకు అతడు తనను సహస్రముఖ ముల నిందించుకొన్నాడు.

## ౧౦

అపరాహ్ణము. మేఘములు తొలగిపోయినవి. మొయిలు విడిచిన యెండ చురుకు చురుక్కుమనుచు కాయుచున్నది. అప్పటికిని కాగోలోజో ఈబక్ హుసేనుతో అమానుష విక్రమముతో పోరుచున్నాడు. పరాజయము నిశ్చయమని తెలిసినప్పటికిని యుద్ధము చేయుచునే యున్నాడు.

కాగోలోజో ఎవరికోసమీ యుద్ధము చేయుచున్నాడు? చట్టగ్రామదుర్గ సమీపమున మొగలు ఫిరంగులు మ్రోగుచున్నవి. సైనికులకు స్థిరముగా నిలుచుండి యుద్ధము చేయుట చాల కష్ట మగుచున్నది. అయినను వారు అట్లే పోరుచున్నారు. జలమార్గము నతడు స్వయముగా రక్షించుచున్నాడు—సామాన్యముగా వదలిపెట్టువాడు కాడు.

మొగలునౌకలు కొన్ని పోర్చుగీస్ ఫిరంగులకు బద్ధలై మునిగిపోయినవి. కాని పోర్చుగీస్ నావలు యుద్ధమునకు భీతిల్లి పారిపోయినవి. మొగల్ ఫిరంగులు చట్టగ్రామదుర్గప్రదేశమును

గర్జించుచుండుటచే ఈబ్రహాంసేను శతగుణితోత్సాహముతో పోరాడుచున్నాడు.

మొగలుల యుద్ధశిక్షా విధానమును కార్లోలోజ్ ఆశ్చర్యముతో తిలకించుచున్నాడు. ఒక నౌక మునిగిపోయి నంతనే యింకొకటి వచ్చి దాని స్థానమున చేరుచున్నది— అత్యుత్సాహముతో ఫిరంగులు పేల్చుచున్నది. ఈబ్రహాంసేనుని వీరత్వమును జూచి కార్లోలోజ్ ఆశ్చర్యాపహృతచిత్తుడైనాడు.

సముద్రగర్భమందలి పోర్చుగీస్ ఆరాకాన్ నౌకలన్నియు తొలగిపోయినంతనే మిగిలిపోయిన కొలది మొగలు నౌకలు ఈబ్రహాంసేను నౌకాశ్రేణిలో జేరినవి.

ఈ సారి కార్లోలోజ్ చివరి ప్రయత్నము చేయదలచి మహావేగముతో పెక్కు ఫిరంగులను ఈబన్‌హాంసేన్ నౌకల మీద పేల్చినాడు. వాని ధాకకు కొన్ని నౌకలేకకాల మున మునిగి పోయినవి. మరల నతడు హుంకారము చేసి ఫిరంగులు పేల్చుటకై ఆదేశ మొసగినాడు. అప్పటికి సూర్యాలోకము నిర్మలముగా ప్రకాశించుచున్నది. అతని నౌక మొగలు సేనాపతి నౌకకెక్కువ దూరముగా లేదు. కార్లోలోజ్ నిదానించి దానివంక చూచినాడు. అప్పుడాస్మికముగా నతనికి ఈబన్‌హాంసేను పార్శ్వమున నొక వ్యక్తి కనిపించినాడు. ఆ వ్యక్తి ఎవరు?

షేలియానా సంగతి రెండు రోజులైన తరువాత ప్రప్రథమమున నప్పుడు కార్లోలోజ్‌కు జ్ఞప్తికి వచ్చినది.

అత డామెను దుర్గమధ్యమున నుంచి వచ్చినాడు. అట్లయిన ఇప్పు డీ వ్యక్తి యెవరు?

ఈబన్ హుసేను షేలియానావంక చూచుచు, "ధన్యుడీ పోర్చుగీస్ వీరుడు! మొగలుల కిట్టి వీరుడు- ఇట్టి యోధు డొక్కడు లభించిన చో!" అని కారోలోజోను మెచ్చుకొన్నాడు. పురుష వేషములో నున్న షేలియానా వదన మండలము గౌరవ ప్రభలతో సముజ్జ్వలమైనది. ఆ సమయమున నామె పోర్చుగీస్ సైనిక వేషమువదలి మొగలు సైనిక వేషము ధరించి యున్నది.

ఆ వేషములో నామెనుజూచి కారోలోగ్రో, "షేలి యానాకు అన్నగాని తమ్ముడుగాని ఉన్నాడా? లేక ఆమెయే మొగలుల పక్షము వహించి యుద్ధముచేయ వచ్చినదా? కా వచ్చును." అను కొన్నాడు. అయినను అతని వజ్రముష్టి శిథిలము కాలేదు.

ఈబన్ హుసేను షేలియానా వైపు తిరిగి ఏదిరో చెప్పబోవుచున్నాడు. అంతలో మొగల్ సైనికు డొకడు ఎచ్చరికగా లేని కారోలోజో మీద తుపాకి పేల్చబోవు చుండుట కనిపెట్టి షేలియానా విద్యుద్వేగముతో లేచి సైనిక హస్తమునుండి అటూలున తుపాకి లాగి వేసినది.

శత్రువీరు డనవధానముతో నున్నప్పుడు చంపనెంచిన సైనికునిపై ఈబన్ హుసేను తీవ్రదృష్టి బరపినాడు. ఇప్పుడు కారోలోజో గ్రహించినాడు, "పురుష వేషములో

నున్నది షేలియా నాయే! నా ప్రాణరక్షణార్థము ఆమె యుద్ధక్షేత్రమును ప్రవేశించినది. లేకున్న నామీదికి లక్ష్యము చేసిన అస్త్రము నెందుకు లాగివేయును?" అని. అప్పు డతనికి, "నీవు యుద్ధములో నెప్పుడును చనిపోవు - నిన్నెవ్వరును చంపలేరు" అని పలికిన ఆమె మాటలు స్మృతికి వచ్చినవి. షేలియానా ఈబన్‌హాసేను పార్శ్వమున నుండుట ప్రత్యక్షముగా చూచి, "ఇదే ఆమె అనుక్తకథ" అని అతడు గ్రహించినాడు.

చట్టగ్రామదుర్గము కడ మొగలు ఫిరంగులు మున్నారముగా మ్రోగుచున్నవి. కార్లోజో అస్త్రము క్రింద బడవైచినాడు.

## ౧౧

జలయుద్ధము పూర్తియైనది. స్థలయుద్ధము యింకను జరుగుచునే యున్నది. చట్టగ్రామ దుర్గము కడ మాటి మాటికిని ఫిరంగి శబ్దములు వినబడుచునే యున్నవి.

సేనాధిపతి కార్లోజో నిరస్త్రుడై స్థిరచిత్తముతో దృఢపద విక్షేపముతో ఈ బన్‌హాసేను నౌకలోనికి బోయినాడు. మొగల్ నౌకాధిపతి ఈ బన్‌హాసేను ససంభ్రమముగా లేచి సాదరముగా గౌరవించి ఇట్లు పలికినాడు: "కార్లోజో! తమ వీరత్వమును జూచి నేను అంత్యంతాశ్చర్యము నొందినాను. తమరు మొగలులపక్షమున దుర్గాధ్య

క్షుడుగా నుండ సమ్మతింతురేని పాదుషావారి అనుమోదము నర్థించుటకై నేను—"

కాగోలోజో చిరునవ్వు నవ్వుచు, "ఈబన్‌హుసేన్ ఖాన్ ! నేనును తమ వీరత్వమును జూచి చకితుడనైనాను. తమ మాటకు ఇంచుక ఆలోచించి ప్రత్యుత్తర మిచ్చెదను" అని పలికినాడు.

షేలియానా కారోలోజో యెదుట మోకరించి అతని కరములుపట్టుకొని, "కారోలోజో! ఈబన్‌హుసేను సబహుమానముగా కోరిన కోరికను సఫలము చేయుము" అని దీనముగా ప్రార్థించినది.

కార్గోలోజో మందస్మితవదనముతో మరల నదే ప్రత్యుత్తర మొసగుచు ఉదాత్తభావముతో నామె చేతులు పట్టుకొనిసాదరముగా లేవదీసినాడు.

తరువాత కాలోరోలోజో ఆవశ్యకవిషయములు మాటాడుటకై సమయము నేర్పాటుచేసికొని ఈబన్ హుసేను వద్ద సెలవు తీసికొని తన నౌకలోనికి వెళ్ళినాడు.

* * * * *

నాలుగు గడియలకాలము గడచినది. సూర్యభగవాను డస్తమించుట కింకను నించుక ఆలస్యమున్నది. కొన్ని దినములు వరుసగా ముసురుపట్టిన తరువాత సూర్యరశ్మి ఎంతో మనోహరముగా నున్నది. అందులో పశ్చిమాకాశమునుండి ప్రకాశించుటచే నూతనోత్సాహము కలిగించుచున్నది. సముద్రమందు తరంగాందోలనములేదు. సముద్ర తరంగము

లును కర్ణఫులీ సాగర సంగమమును మహోజ్జ్వల పరికాశ ములో తేలియాడుచున్నవి.

కార్లోజో పడవలోనుండి బయటికి వచ్చి ఒకానొక సైనికుని బిలిచి ఉత్తరమును కాగితములకట్టయు అతని చేతి కిచ్చినాడు. తలయెత్తి నాలుగు వైపులు పరికించినాడు, అస్త మాన సూర్యుడు భూమ్యాకాశ సంధి ప్రదేశమందును, కర్ణ ఫులీముఖముమీదను దాడిమీకుసుమశోభలు క్రుమ్మరించు చున్నాడు. కార్లోజో మొట్టమొదటిసారి చట్టగామ సముద్ర తీరమునకు వచ్చి ఏ ప్రదేశమున నిలుచుండి నూతన జగత్తును తిలకించినాడో, నూతన స్వప్నముల గాంచినాడో నేడాస్థల మున నున్నాడు. అతని జీవితమునకు కేంద్రస్థానమేదో అచట నిలుచుండినాడు.

ఉన్నట్లుండి అతని మనసుకు తగిలినది సైనికుడక్కే నిలబడి యున్నాడని. అప్పు డతడు భావోద్రేకమును నిగ్ర హించుకొని ధీరశాంతభావముతో, "నేను స్నానము చేయ బోవుచున్నాను. నీవీకాగితముల కట్టయు ఉత్తరమును ఒక్క అరగంట అయిన తరువాత మొగల్ సేనానాయకుడగు ఈబక్ హుసేనుఖానుకు అందజేయుము" అని చెప్పినాడు. సైనికుడు సలాము చేసి వెళ్లినాడు.

తరువాత కార్లోజో దృఢపద విక్షేపముతో కర్ణ ఫులీ సాగర సంగమమున స్నానము చేయబోయినాడు.

ఈబ్రహాముసేనును పేలియానాయును తొందర తొందరగా దుస్తులు ధరించుకొని చక్కని నౌక నాయత్తము చేసి కార్లోజో కొరకు నిరీక్షించుచున్నారు.

కార్లోజో స్నానము చేయబోయి అరగంట దాటినది. ఇంకను నతడు తిరిగి రాలేదు. ఈబ్రహాముసేనును పేలియానాయును వ్యగ్రమనస్కులైనారు. ఇంతలో మొగల్ సైనికుడొకడు వచ్చి, "పోర్చుగీస్ సేనాధిపతి నీళ్లలోనికిబోయి ఒక్కసారి మునిగినాడు. మరల లేవలేదు" అని చెప్పినాడు.

తోడనే ఈబ్రహాముసేనును పేలియానాయును కంపిత హృదయములతో నచటికి పోవుటకై లేచినారు. బయలుదేరబోవుచుండ పోర్చుగీస్ సైనికుడొకడు ఎదురువచ్చి ఇరువురకును సలాముచేసి ఉత్తరమును కాగితముల కట్టయు సేనాపతి చేతిలోనుంచి సలాముచేసి వెళ్లినాడు.

ఈబ్రహాముసేను ఉత్తరముతీసి ఇట్లు చదివినాడు: "పోర్చుగల్ దేశములోని శాంతియాగో ప్రదేశపు తొమ్మిదవ ప్రభువు వ్రాసిన శేషలేఖ—

"నాపేరు ఆల్ఫాంజో ఆక్టేవియస్ కార్డోజో. నేను పోర్చుగల్ లోని శాంతియాగో దేశమునకు తొమ్మిదవ ప్రభువును. నాది కార్డోజో వంశము. రోమునగరములోని మతాధికారి న్యాయము విచారించి నా పూర్వులార్జించిన భూసంపత్తికిని అర్థసంపత్తికిని నేనొక్కడనే ఉత్తరాధికారిని అని తీర్పు చెప్పినాడు.

"నేను నా పూర్వపురుషుల అజ్ఞాతవాస సమయమున కాసోజో అను నావంశనామము నుపయోగించుకొనక కార్లోలోజో అను నామముతోడనే వ్యవహరించినాను. ఈ నా చివరి లేఖలో ఈ విషయమును వ్రాయుచున్నాను.

మతాధికారి నాకోసము రోము నగరమున ఆయన అధీనములో నాలుగులక్షల రూపాయల విలువగల ధనసంపత్తి నిలువచేసి యుంచినారు. పోర్చుగల్‌లోని నా భూసంపత్తిని, రోమునగరములోని నా ధనసంపత్తిని నాప్రియసోదరి షేలియానా వివాహసమయమున దంపతుల కానుకలక్రింద అర్పించుచున్నాను.

మొగల్‌వీరుడు ఈబన్‌హుసేన్‌ఖానే షేలియానాకు తగిన భర్త. షేలియానాకు నేను చెప్పదలచిన జీవితకథ ఎప్పుడో ఒకనాడు చెప్పవలసియున్నది గదా అని—"

ఈబన్‌హుసేను నేత్రము లశ్రుపూరితములైనవి. అతడిక ఉత్తరము చదువలేకపోయినాడు. షేలియానా ప్రక్కన నిలిచి యున్నది. ఆమె శరీరము ముచ్చెమటలుపోసి నిలువున కంపించుచున్నది. ఈబన్‌హుసేను షేలియానా చేతులు పట్టుకొని సానురాగముగా "నీవిక కూర్చుండుము" అని చెప్పుచుండగా పోర్చుగీస్ సైనికులు కొందరు కార్లోలోజో మృతదేహము నచటికి మోసికొనివచ్చినారు.

కార్లోలోజో స్నానముచేయుటకై దిగినచోట మునిగి అడుగున నున్న పడవలంగరు గట్టిగా పట్టుకొని అచట బోర

